శ్రీః

శ్రీజగద్గురుశ్రీమచ్ఛఙ్కరభగవత్పాదాచార్యవిరచితా

# శివానందలహరీ

। బలిజేపల్లి లక్ష్మీకాంత కవివిరచితా । ప్రతిపదాంధ్రవ్యాఖ్యానపద్యసహితా ।




ప్రకాశకులు

**రావి మోహనరావు,** M.Sc., M.A., (Sanskrit)

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

శ్రీః

శ్రీజగద్గురుశ్రీమచ్ఛఙ్కరభగవత్పాదాచార్యవిరచితా

# శివానందలహరీ

। బలిజేపల్లి లక్ష్మీకాంత కవివిరచితా । ప్రతిపదాంధ్రవ్యాఖ్యానపద్యసహితా ।


ప్రథమముద్రణ : 1916
ద్వితీయముద్రణ : 22.08.2020
ప్రతులు : 500
పుటలు : 84
వెల : రూ. 40/-


© **RAVI MOHANARAO, M.Sc., M.A., (Sanskrit)**

**404, Janjanam Complex,**
**Opp. I Town Police Station,**
**Chirala - 523 155.**
**Cell : 94401 15411**



**D.T.P. by :**
**P.PARVATHI**
**Cell : 74165 86775**

**Printed at :**
**Karshak Art Printers**
**HYDERABAD**



శ్రీ శంకరగురుభ్యో నమః

# శ్రీ శివానందలహరి

శ్రీ జగద్గురు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారిచే
రచియింపఁబడినది.

బలిజేపల్లి లక్ష్మీకాంత కవిచే రచియింపఁబడిన
ఆంధ్రపద్యములతోడను
ప్రతిపదాంధ్రపదటీకాతాత్పర్యములతోడను
ముద్రింపఁబడినది.

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

1916

వెల 1—0—0] [కాపీరైట్.

## పీఠిక

శ్రీ జగద్గురు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారిచే ముముక్షువుల కుపయోగార్థమై రచియింపఁబడిన "**శ్రీశివానందలహరి**"లో నిక్కడకుఁ చిరకాలము క్రిందఁ గొన్ని శ్లోకములఁ దెనిగించితి. కార్యశమున నేను ఓరుగల్లు (వరంగల్)నకు బోయినప్పుడు సంతతశివపూజా పరాయణులును నిరతాన్న ప్రదాతలును నుభయభాషాకవిమిత్రులును నగు శ్రీముదిగొండ శంకరార్యులవారిం దర్శించి వారికి నా తెనిఁగించిన పద్యముల వినిపింపఁగా నేతద్గ్రంథపరిసమాప్తికి వారు నన్నెంతయో ప్రోత్సాహవఱచిరి. వారి ప్రోత్సాహమునకుఁదోడు మా యీ జిల్లాలోఁ దహశీల్దారుగారును ఆస్తికశిఖామణులునునగు బ్రహ్మశ్రీ పెద్దిభొట్ల నాగేశ్వరముగా రీగ్రంథముద్రణమునకై కొంత సహాయము చేసి నా కుత్సాహముం గూర్చినందులకు వారికి నా కృతజ్ఞతాభివందనము లర్పించు చున్నాఁడను. ఇఁక నాభాషాంతరీ కరణమునఁగల గుణాగుణములను బండితులైన చదువరులే నిర్ణయింతురుగాక.

ఇట్లు,
పండిత విధేయుఁడు,
**బలిజేపల్లి లక్ష్మీకాంతం**

పూర్వముద్రణానుసారము నేడు ఈ గ్రంథము '**శ్రీశివభగవానుని**' కృపాకటాక్షములతో పునర్ముద్రింపబడినది. వ్యాఖ్యను అందించిన **కీ.శే. బలిజేపల్లి లక్ష్మీకాంతం కవి గార్కి** నమస్సుమాంజలులతో సమర్పితము

**– రామోరా.**

22.08.2020
చీరాల.

శ్రీః

శ్రీమచ్ఛంకరసద్గురుభ్యో నమః

# శివానందలహరీ

ప్రతిపదాంధ్రవ్యాఖ్యానపద్యసహితా

**శ్లో॥ కలాభ్యాం చూడాలంకృతశశికలాభ్యాం నిజతపః**
**ఫలాభ్యాం భక్తేషు ప్రకటితఫలాభ్యాం భవతు మే ।**
**శివాభ్యామస్తోకత్రిభువనశివాభ్యాం హృది పున-**
**ర్భవాభ్యామానందస్ఫురదనుభవాభ్యాం నతిరియమ్ ॥ 1**

**టీక :** కలాభ్యామ్ = వేదప్రసిద్ధసకలవిద్యాస్వరూపులును, చూడాలంకృతశశికలాభ్యాం : చూడా = శిఖలచేతను, అలంకృత = అలంకరింపబడిన, శశి = చంద్రునియొక్క, కలాభ్యామ్ = కళలుగలవారును, (అనఁగాఁ జంద్రకళాతిశాయి శిఖావిశిష్టులని తాత్పర్యము) నిజతపః ఫలాభ్యాం: నిజ = స్వకీయములయిన, తపః = తపస్సులయొక్క, ఫలాభ్యామ్ = ఫలభూతులైన వారును (అనఁగాఁ బరస్పరతపఃఫలభూతులని తాత్పర్యము), భక్తేషు = స్వభక్తులయందు, ప్రకటితఫలాభ్యాం : ప్రకటిత = ప్రకటనచేయఁబడిన, ఫలాభ్యామ్ = ధర్మాదిఫలములు గలవారును, అస్తోకత్రిభువనశివాభ్యాం : అస్తోక = అతిశయమైన, త్రిభువన = ముల్లోకములకు, శివాభ్యామ్ = మంగళములు కలుగఁజేయువారును (అనఁగా మూడులోకములకు విశేషముగా శుభములను గలుగఁజేయువారలని తాత్పర్యము), హృది = మనస్సునందు, పునర్భవాభ్యామ్ = ధ్యానముచేయుటచేతఁ బుట్టుచుండువారును (అనఁగా ఎప్పుడెప్పుడు ధ్యానము చేయుచున్నారో అప్పుడప్పుడు నూతనముగాఁ బుట్టుచుండెడువారని తాత్పర్యము), ఆనందస్ఫురదనుభవాభ్యాం : ఆనంద = ఆనందముతోడను, స్ఫురత్ = ప్రకాశించుచుండెడు, అనుభవాభ్యామ్ = స్వరూపబోధకలిగినవారును అగు, శివాభ్యామ్ = పార్వతీపరమేశ్వరుల కొరకు, ఇయమ్ = ఈ నా సంబంధ మయిన, నతిః = నమస్కారము, భవతు = అగునుగాక.

శా. లలితామ్నాయకలాకలాపులు, శిఖాలంకారతారేట్కలా
కలితుల్ స్వీయతపఃఫలాయితులు భక్తవ్యక్తధర్మక్రియా
ఫలు లానంద రసానుభావులును, శశ్వద్విశ్వభద్రప్రదా
తలు హృద్ధ్యానపునర్భవుల్, శివులకున్ దార్తున్ నమోవాకముల్.

**తా :** తమలోఁ దాము చేసిన యుగ్రతపస్సుచేత నొకరికొకరు ఫలముగా నర్ధనారీశ్వరమూర్తులై యెల్లలోకములకు శుభదాయకులై కర్మఫలప్రదాయకులై భక్తులు ధ్యానముచేయుపట్ల నిమిష నిమిషమునను వారల హృదయములయం దావిర్భవించుచు ముముక్షువుల కానంద సాక్షాత్కారముల నొసఁగుచు సమస్తవిద్యాస్వరూపులయి యున్న యాగౌరీశంకరులకు నమస్కారము.

**శ్లో॥ గళంతీ శంభో! త్వచ్చరితసరితః కిల్బిషరజో**
**దళంతీ ధీకుల్యాసరణిషు పతంతీ విజయతామ్ ।**
**దిశంతీ సంసారభ్రమణ పరితాపోపశమనం**
**వసంతీ మచ్చేతోహ్రదభువి శివానందలహరీ ॥ 2**

**టీక :** హే శంభో! = ఓ సుఖకారణా! త్వచ్చరితసరితః–త్వత్ = నీ యొక్క, చరిత = చరిత్రమనియెడు, సరితః = ప్రవాహమునుండి, గళంతీ = జారుచున్నదియు, కిల్బిషరజో దళంతీ : కిల్బిష = పాపములనియెడు, రజః = పరాగమును, దళంతీ = ఛేదించుచున్నదియు, ధీకుల్యాసరణిషు : ధీ = బుద్ధులనియెడు, కుల్యా = కాలువల యొక్క, సరణిషు = మార్గముల యందు, పతంతీ = పడుచున్నదియు, సంసారభ్రమణపరితాపోపశమనం : సంసార = జననమరణరూపమైన సంసారమందు, భ్రమణ = తిరుగుటచేఁబుట్టిన, పరితాప = దుఃఖముయొక్క, ఉపశమనమ్ = శాంతిని, దిశంతీ = ఇచ్చుచున్నదియు, మచ్చేతోహ్రదభువి : మత్ = నాయొక్క, చేతః = చిత్తమనియెడు, హ్రద = మడుగుయొక్క, భువి = భూమియందు, వసంతీ = ఉండునదియునగు, శివానందలహరీ : శివ = పార్వతీపరమేశ్వరులచేతఁ బుట్టింపఁబడిన, ఆనంద = సంతోషముయొక్క, లహరీ = ప్రవాహము, విజయతామ్ = సర్వోత్కృష్టముగా నుండుగాక.

మ. కుశలత్వచ్చరితాపగన్ వెడలుచున్, ఘోరాఘపాంశుచ్ఛటా
ప్రశమప్రౌఢివహించి, బుద్ధియనుకాల్వంబారి, సంసారదు
ర్వశసంతాపమడంచి, మామకమనఃపద్మాకరంబందు ని
ల్చు శివానందసుధాప్రవాహము రహించున్ శ్రీజయోత్కర్షతన్.

**తా :** ఓ శంకరా! భక్తపరిపాలనాది రూపములగు, నీ చరిత్రములు మహానదులు. వానినుండి స్రవించి పాఱుచు పాపములనియెడు దుమ్ములనణఁచుచున్న యీ శివానందలహరి

బుద్ధియను పిల్లకాలువగుండ వచ్చి సంసారసంతాపము శాంతిపఱచు నా హృదయమను పెద్దచెఱువులోఁబడినది. ఇది యిఁక నన్నెఁడును వీడకుండ స్థిరముగా నుండునట్లను గ్రహింపుము.

**శ్లో॥ త్రయీవేద్యం హృద్యం త్రిపురహరమాద్యం త్రిణయనం**
**జటాభారోదారం చలదురగహారం మృగధరమ్ ।**
**మహాదేవం దేవం మయి సదయభావం పశుపతిం**
**చిదానందం సాంబం శివమతివిడంబం హృది భజే ॥ 3**

**టీక :** అహమ్ = నేను, త్రయీవేద్యం : త్రయీ = వేదత్రయముచేతను, వేద్యమ్ = తెలుసుకొనఁదగినవానిని, హృద్యమ్ = మనోజ్ఞుఁడైనవానిని, త్రిపురహరమ్ = స్థూలాదిశరీరత్రయనాశకుఁడైనవానిని, ఆద్యమ్ = ఆదియందుఁబుట్టినవానిని, త్రిణయనమ్ = మూడుకన్నులు కలిగిన వానిని, జటాభారోదారం : జటా = జడలయొక్క, భార = భారముచేతను, ఉదారమ్ = గంభీరుఁడైనవానిని, చలదురగహారం : చలత్ = కదలుచున్న, ఉరగ = సర్పములనియెడు, హారమ్ = భూషణములు గలిగిన వానిని, మృగధరమ్ = లేడిని ధరించినవానిని, మహాదేవం : మహత్ = గొప్పైన దేవమ్ = దేవుఁడైన వానిని, దేవమ్ = ఆనందరూపుఁడైన వానిని, మయి = నాయందు, సదయభావం : సదయ = దయతోఁగూడుకొన్న, భావమ్ = భావము కలిగిన వానిని, పశుపతిమ్ = బ్రహ్మాదిలోకపాలకుఁడైన వానిని, చిదాలంబం : చిత్ = స్వరూపజ్ఞానమునకు, ఆలంబమ్ = సాధనుఁడైన వానిని, సాంబమ్ = పార్వతీదేవితోఁ గూడియున్న వానిని, అతివిడంబమ్ = ప్రాప్తకాలానుకారియైన వానిని, శివమ్ = ఈశ్వరుని, హృది = మనస్సు నందు, భజే = సేవించుచున్నాను.

**సీ.** ప్రాఁబల్కుల నెఱుంగఁబడువానిఁదొలివానిఁ
దనివిదీరఁగఁజూడఁ దగినవాని
పెంజడల్దాల్చి యొప్పిదముసూపెడువానిఁ
జిలువపేరులఁబూని చెలఁగువాని
మూడుకన్నులవాని, లేడిఁదాల్చినవానిఁ
ద్రిపురంబులహరించు తేజువాని
ఆనందమయమైన యాకృతిగలవానిఁ
గరుణామతిన్ నన్ను గాచువాని

**గీ.** అఖిలభూతంబులకుఁ బతియైన వాని
వేల్పులకునెల్ల వేల్పుగా వెలయువానిఁ

దనదుసామేన సత్తితోఁ దనరువాని
నతివిడంబుఁజిదాలంబు నాత్మఁదలఁతు.

**తా** : అనఁగా శివునియొక్క సంతోషమునకు ఆయనను భజనసేయుటయే మూలమవుట వలన తద్భజనమును జేయుచున్నానని ముఖ్యతాత్పర్యము.

**శ్లో॥ సహస్రం వర్తంతే జగతి విబుధాః క్షుద్రఫలదా
నమన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృతఫలమ్ ।
హరిబ్రహ్మాదీనామపి నికటభాజామసులభం
చిరం యాచే శంభో! శివ! తవ పదాంభోజభజనమ్ ॥ 4**

**టీక :** జగతి = లోకమందు, క్షుద్రఫలదాః : క్షుద్ర = తుచ్ఛమైన, ఫలదాః = ఫలమునిచ్చెదు, విబుధాః = దేవతలు, సహస్రమ్ = వేలకువేలు, వర్తంతే = ఉండుచున్నారు, అహమ్ = నేను, స్వప్నే వా = కలయందైనను, తదనుసరణం : తత్ = ఆ దేవతలయొక్క, అనుసరణమ్ = అనుసరణమును, తత్కృతఫలం : తత్ = ఆ దేవతలచేతను, కృత = చేయఁబడిన, ఫలమ్ = ఫలమును, నమన్యే = తలఁపను, కింతు = ఇఁక నేమన, నికటభాజాం : నికట = సమీపమును, భాజామ్ = పొందుచున్నట్టి, హరిబ్రహ్మాదీనామపి : హరి = విష్ణువు, బ్రహ్మ = బ్రహ్మయు, ఆదీనామపి = మొదటఁగలిగిన దేవతలకు, అసులభమ్ = దుర్లభమైనట్టి, హే శంభో! = ఓ సుఖకరుఁడవైన ఈశ్వరుఁడా!, తవ = నీయొక్క, పదాంభోజభజనమ్ : పదాంభోజ = పాదారఁవిందములయొక్క, భజనమ్ = సేవను, చిరమ్ = తడవుగాను, యాచే = యాచనసేయుచున్నాను.

**మ. తలఁపన్ వేల్పులకేమి? క్షుద్రఫలదాల్ పెక్కుఱున్నారు నేఁ
ఁగలనేన్ దత్ఫలమున్ తదీయభజనన్ గాంక్షింప నిత్యంబు చెం
తల సేవించు విరించికైన హరికైనన్ దుర్లంభంబౌ భవ
ల్లలితంపుంజరణాబ్జదాస్యమున కాలంబించెదన్ శంకరా! .**

**తా** : అనఁగా సమస్త దేవతలకంటె శివోత్కర్ష అతిశయమయినదని యెంచి ఆయనయొక్క పాదసేవను జేయుటకు ఆ శివునినే యాచించుచున్నానని ముఖ్యతాత్పర్యము.

**శ్లో॥ స్మృతౌ శాస్త్రే వైద్యే శకునకవితాగానఫణితౌ
పురాణే మంత్రే వా స్తుతినటనహాస్యేష్వచతురః ।
కథం రాజ్ఞాం ప్రీతిర్భవతి మయి కోஉహం పశుపతే!
పశుం మాం సర్వజ్ఞ! ప్రథిత! కృపయా పాలయ విభో! ॥ 5**

**టీక :** స్మృతౌ = మన్వాదిస్మృతి సమూహములయందును, శాస్త్రే = తర్కవ్యాకరణాది

శాస్త్రములయందును, వైద్యే = వైద్యశాస్త్రమునందును, శకునకవితాగానఫణితౌ : శకున = ప్రయాణాది కాలములయందుఁ గాక గరుడజంబుకాదులయొక్క సవ్యాపసవ్యగమన విధినిషేధశాస్త్రముయొక్కయు, కవితా = కవిత్వము యొక్కయు, గాన = సంగీతముయొక్కయు, ఫణితౌ = వాక్కునందును, పురాణే = శైవవైష్ణవాది పురాణముల యందును, మంత్రే వా = మంత్రశాస్త్రము నందును, స్తుతినటనహాస్యేష్వచతురః : స్తుతి = ముఖస్తవముల యందును, నటన = నాట్యములయందును, హాస్యేషు = హాస్యములయందును, అచతురః = అసమర్థుఁడను. (తస్మాత్ = అందువలన), రాజ్ఞామ్ = రాజులకు, మయి = నాయందు, కథమ్ = యే ప్రకారముగా, ప్రీతిః = ప్రేమ, భవతి = అగుచున్నది. (అతః = అందువలన) హే పశుపతే! =ఓ సర్వప్రభుఁడవైన ఈశ్వరా!, హే ప్రథిత = ఓయి సుప్రసిద్ధుఁడా!, పశుమ్ = పశుస్వరూపుఁడనైన, మామ్ = నన్ను, కృపయా = కరుణచేత, పాలయ = రక్షింపుమా.

ఉ. స్మృతిశాస్త్రస్తుతిహాస్యగానకవితానృత్యాదితంత్రంబులన్
జతురత్వంబు నెఱుంగ నన్ను నృపు లేచందానఁ బ్రేమింతురో
పతి! సర్వజ్ఞ! శ్రుతిప్రథా! నను బశుప్రాయున్ గృపావైభవో
న్నతిఁ బాలింపఁగదయ్య శ్రీపశుపతీ! జ్ఞానప్రసన్నాకృతీ!.

**తా** : అనఁగా సకలశాస్త్రములనభ్యసించిఁ రాజులయొక్క యాశ్రయము సంపాదించుకొని, కుటుంబపోషణము చేసికొనవలయునను తాత్పర్యము లేదు. శాస్త్రపరిజ్ఞానహీనుఁడనగు అసమర్థుడను కాన నాయందు రాజులకుఁ బ్రీతి కలుగనేరదు. నీ కటాక్షమునే యపేక్షించు చున్నాను. రక్షింపుము అని తాత్పర్యము.

**శ్లో॥ ఘటో వా మృత్పిణ్డోఽప్యణురపి చ ధూమోగ్నిరచలః**
**పటో వా తంతుర్వా పరిహరతి కిం ఘోరశమనమ్ ।**
**వృథా కంఠక్షోభం వహసి తరసా తర్కవచసా**
**పదాంభోజం శంభోర్భజ పరమసౌఖ్యం వ్రజ సుధీః! ॥ 6**

**టీక :** హే సుధీః! = ఓయి మంచిబుద్ధిగలవాఁడా, ఘటో వా = కుండగాని, మృత్పిండోఽపి = మట్టిముద్దగాని, అణురపి = పరమాణువుగాని, ధూమః = పొగగాని, అగ్ని = అగ్నిగాని, అచలః = పర్వతముగాని, పటో వా = వస్త్రముగాని, తంతుర్వా = దారముగాని, తర్కశాస్త్రమునందు వ్యవహరింపఁబడియెడునివి, ఘోరశమనమ్ : ఘోర = భయంకరుఁడైనట్టి, శమనమ్ = యముని, పరిహరతి కిమ్ = పరిహరించుచున్నదా యేమి?, తర్కవచసా = తర్కశాస్త్రవాక్కుచేతను, వృథా = వ్యర్థము, కంఠక్షోభమ్ = గళశ్రమమును, త్వమ్ = నీవు, వహసి = వహించుచున్నావు, శంభోః = శివునియొక్క, పదాంభోజమ్ = అంఘ్రికమలమును,

భజ = సేవింపుమా, తరసా = శీఘ్రముగాను, పరమసౌఖ్యమ్ = మోక్షసామ్రాజ్యమును, వ్రజ = పొందుమా.

మ. ఘటమో మృణ్మయపిండమో యణువులో గ్రావంబొ ధూమాగ్నులో
పటమో దారమో ఘోరకాలుని హరింపన్ జాలునే! యేటికీ
కటువక్రోద్భటతర్కవాదములచేఁ గంఠశ్రమంబొందఁ నిం
తటనైనన్ సుఖియింపుమా శివపదధ్యానంబునన్ సన్మతీ! .

**తా** : అనఁగా ఓయి మంచిబుద్ధిగలవాడా! వృథాగా దర్కవాక్కులచేతఁగంఠక్షోభమును జేయఁగా నావాక్కులు యనుబాధనెట్లు శాంతిపొందించును. పొందింపనేరవు. గాన శివపాదభజనమును జేయుమా మోక్షమును బొందెదవని ముఖ్యతాత్పర్యము.

**శ్లో॥ మనస్తే పాదాబ్జే నివసతు వచస్స్తోత్రఫణితౌ**
**కరశ్చాభ్యర్చాయాం శ్రుతిరపి కథాకర్ణనవిధౌ ।**
**తవ ధ్యానే బుద్ధిర్నయనయుగళం మూర్తివిభవే**
**పరగ్రంథాన్కైర్వా పరమశివ! జానే పరమతః ॥ 7**

**టీక :** హే పరమశివ! = ఓయి సాంబశివుఁడా!, తే = నీయొక్క, పాదాబ్జే = చరణ కమలమందు, మనః = చిత్తము, నివసతు = ఉండుఁగాక, వచః = వాక్కు, స్తోత్రఫణితౌ : స్తోత్ర = స్తుతియొక్క, ఫణితౌ = వాక్కునందు, నివసతు = ఉండుఁగాక, కరః = హస్తము, అభ్యర్చాయా = నీయొక్క పూజయందు, నివసతు = ఉండుఁగాక, శ్రుతిరపి = శ్రవణమును, కథాకర్ణనవిధౌ : కథా = నీ కథలయొక్క, ఆకర్ణన = వినుటయొక్క, విధౌ = విధియందు, నివసతు = ఉండుఁగాక, బుద్ధిః= బుద్ధి, తవ = నీ యొక్క, ధ్యానే = ధ్యానము సేయుటయందు, నివసతు = ఉండుఁగాక, నయనయుగళం : నయన = నేత్రముల యొక్క, యుగళమ్ = ద్వందము, మూర్తి = నీ స్వరూపము యొక్క, విభవే = వైభవమునందు, నివసతు = ఉండుఁగాక, అతః = అందువల్ల నుండి, కైర్వా = ఏకారణముల చేతనైన, పరగ్రంథాన్ : పర = యితరములైన, గ్రంథాన్ = గ్రంథములను, జానే = గుర్తెరుగుచున్నాను.

శా. నీపాదాబ్జములన్ మనంబు మరియున్ నిన్నాడఁగా వాక్కులున్
నీపూజావిధియందు హస్తము చెవుల్ నీసత్కథాకర్ణన
వ్యాపారంబున, బుద్ధి సంతతభవద్ధ్యానంబునన్ దృష్టి నీ
రూపశ్రీనివసింప నెట్టెఱుంగ నేర్తున్ దృత్పరగ్రంథముల్.

**తా** : అనఁగా మనస్సు మొదలైన ఆతీంద్రియము లాఱు విధముల నీ సేవ చేయుచుండఁగా వేరే మరియొక గ్రంథార్థముల నే యింద్రియములచేతఁ దెలిసికొనుచున్నాను. నా మనస్సు

మొదలగు నంతరింద్రియ బహిరింద్రియములన్నియు నీ సేవదక్క మరియొందు సేవ సేయక యుండుఁగాక యని తాత్పర్యము.

**శ్లో॥ గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే**
**విశాలే శైలే చ భ్రమతి కుసుమార్థం జడమతిః ।**
**సమర్ప్యైకం చేతస్సరసిజముమానాథ! భవతే**
**సుఖేనావస్థాతుం జన ఇహ న జానాతి కిమహో! ॥ 8**

**టీక :** గభీరే = లోతైన, కాసారే = తటాకమునందును, విజనే = జనశూన్యమైన, ఘోరవిపినే = క్రూరమృగములచే భయంకరమైన యరణ్యంబునందును, విశాలే = విస్తీర్ణమైన, శైలే చ = పర్వతమునందును, జడమతిః : జడ = మూఢమైన, మతిః = బుద్ధిగలవాఁడు, కుసుమార్థమ్ = పుష్పప్రయోజనము కలుగునట్లుగా ( పుష్పముల కొఱకై యనుట), భ్రమతి = తిరుగుచున్నాఁడు, హే ఉమానాథ! = పార్వతీదేవికిఁబతివైన ఓ ఈశ్వరుఁడా!, ఏకమ్ = ఒకటైన, చేతస్సరసిజం : చేతః = మనస్సనియెడు, సరసిజమ్ = పద్మమును, భవతే = నీ కొఱకు, సమర్ప్య = సమర్పించి, సుఖేన = సుఖముతో, ఇహ = ఇచ్చటను, అవస్థాతుమ్ = నిశ్చలుఁడుగానుండుకొఱకు, న జానాతి = ఎఱుఁగడు, కిమహో! = ఏమాశ్చర్యము?

**ఉ. ఊరక సంచరించు విజనోగ్రపుఁగానలఁ గోనలన్ సరో**
**వారములందు నీకుఁబ్రసవంబులఁదేర జడుండహో! భవా**
**నీరమణీమనోహర! వినిశ్చలుఁడై యిటనుండియే మన**
**స్సారసమొండు నీకొసఁగు సౌఖ్యపుదారియెఱుంగఁడే కదా!.**

**తా :** అనఁగా మూఢుఁడు తన మనఃకమలమును నీశ్వరార్పణము చేసి సుఖింపనేరక పుష్పార్థమై పర్వతములు అరణ్యములు మొదలగు ప్రదేశముల సంచరించుచున్నాఁడు. బహుదేశసంచారముకన్న నేకదేశమునందుండి చిత్తము భగవదర్పితముచేసి కైవల్యంబు నొందనగునని తాత్పర్యము.

**శ్లో॥ యథా బుద్ధిశ్శుక్తౌ రజతమితి కాచాశ్మని మణిః**
**జలే పైష్టే క్షీరం భవతి మృగతృష్ణాసు సలిలమ్ ।**
**తథా దేవభ్రాంత్యా భజతి భవదన్యం జడజనః**
**మహాదేవేశ! త్వాం మనసి చ నమత్వా పశుపతే! ॥ 9**

**టీక :** హే మహాదేవ! = ఓ దేవాధిదేవా!. హే ఈశ! = ఓ పరమశివా!, హే పశుపతే! = ఓ సకలభూతనాయకా!, త్వామ్ = నిన్ను, మనసి = మనస్సునందు, నమత్వా = తెలిసికొనక, జడజనః = మూర్ఖజనుఁడు, శుక్తౌ = ముత్తెపుఁజిప్పయందు, రజతమితి = వెండియని, కాచాశ్మని = గాజురాతియందు, మణిః = మాణిక్యమని, పైష్టే = పిండిసంబంధమైన, జలే

= నీటియందు, క్షీరమ్ = పాలని, మృగతృష్ణాసు = ఎండమావులయందు, సలిలమ్ = నీరని, యథా = ఏ ప్రకారముగా, బుద్ధిః= మతి, భవతి = అగుచున్నదో, తథా = ఆ ప్రకారముగా, దేవభ్రాంత్యా = దేవుఁడను భ్రాంతిచేత, భవదన్యం : భవత్ = నీ కంటె, అన్యమ్ = ఇతరుని, భజతి = భజించుచున్నాఁడు.

మ. నిను నీశున్ మదిఁ దానెఱుంగక, భవానీనాథ! ముత్తెంపుఁజి
ప్పను రూప్యంబని, గాజు రత్నమనియున్ బైష్టంబునీరంబు పా
లని, నీరంబని యెండమావులను భ్రాంత్యాధీనుఁడౌరీతి నె
వ్వనినో యన్యుభజించు మూఢమతి దేవభ్రాంతి లోకేశ్వరా!.

**తా** : మూర్ఖులు శివతత్త్వమెఱుంగక చిల్లర దేవతలను గొలుతురు. సర్వోత్కృష్టమైనది శివతత్త్వమే అని, తాత్పర్యము.

**శ్లో॥ నరత్వం దేవత్వం నగవనమృగత్వం మశకతా
పశుత్వం కీటత్వం భవతు విహగత్వాదిజననమ్ ।
సదా త్వత్పాదాబ్జస్మరణపరమానందలహరీ–
విహారాసక్తం చేద్ధృదయమిహ కిం తేన వపుషా! ॥ 10**

**టీక :** నరత్వమ్ = మనుష్యభావమును, దేవత్వమ్ = దేవభావమును, నగవనమృగత్వమ్ = పర్వతారణ్యమృగభావముల నేదేనియు, మశకతా = దోమజన్మమును, పశుత్వమ్ = పశుభావమును, విహగత్వాది = పక్షులు మొదలగునవిగా, జననమ్ = పుట్టుక (మమ = నాకు), భవతు = ప్రాక్తన కర్మాధీనమువలననగుఁగాక (మే = నాయొక్క), హృదయమ్ = చిత్తము, ఇహ = పూర్వోక్తములయిన ఈ నరాదిజన్మములయందు, సదా = యెల్లప్పుడు, త్వత్పాదాబ్జస్మరణ పరమానందలహరీవిహారాసక్తం : త్వత్ = నీయొక్క, పాదాబ్జ = చరణారవిందములయొక్క, స్మరణ = స్మరించుటయను, పరమ = ఉత్కృష్టమైన, ఆనంద = సంతోషముయొక్క, లహరీ = ప్రవాహముయొక్క, విహార = విహరించుటయందు, ఆసక్తమ్ = ఆసక్తి గలది, భవతు = అగుఁగాక (ఏవం = ఈ ప్రకారముగా), చేత్ = అయినచో, తేన = ఆ, వపుషా = శరీరములచేత, కిమ్ = ఏమి ప్రయోజనము.

చ. నరసురశైలకీటకవనద్విజగోమృగతాదిజన్మముల్
పరగిననేమి? చిత్తము భవత్పదపంకజసేవనాసుఖో
త్తరలహరీవిహారవిహితంబగునంత నిరూఢవృత్తియే
దొరకొనినన్ శరీరములతోఁ బనియేమి? భవాబ్ధిపోతమా!.

**తా** : అనఁగా బూర్వజన్మమునందుఁజేయఁబడిన పాపపుణ్యకర్మాధీనమువలనఁ బశు

పక్ష్యాదిజన్మములేని మనుష్యాదిజన్మములేని సంభవించినను నే జన్మమునందైన ఈశ్వరచరణారవిందధ్యానబ్రహ్మానందానుభవము కలిగియుండు నేని యే పుట్టుకయైనను నొక్కటే అని తాత్పర్యము.

**శ్లో॥ వటుర్వా గేహీ వా యతిరపి జటీ వా తదితరో**
**నరో వా యః కశ్చిద్భవతు భవ! కిం తేన భవతి ।**
**యదీయం హృత్పద్మం యది భవదధీనం పశుపతే!**
**తదీయస్త్వం శంభో! భవసి భవభారం చ వహసి ॥ 11**

**టీక :** వటుర్వా = బ్రహ్మచారియైననేమి, గేహీ వా = గృహస్థయిననేమి, యతిరపి = సన్యాసియైననేమి, జటీ వా = జడధారియైననేమి, తదితరః = వీరుగాక మరియెవఁడైననేమి, కశ్చిత్ వా = ఒకానొకఁడు, భవతు = అగుఁగాక, తేన = అందుచేత, హే భవ! = ఓ శంభుఁడా!, కిమ్ = ఏమి, భవతి = అగుచున్నది, హే పశుపతే! = సకలభూతములకు నాయకుఁడవైన ఓ ఈశ్వరుఁడా!, యదీయమ్ = ఏ సంబంధమైన, హృత్పద్మమ్ = హృదయకమలము, భవదధీనం యది = నీయధీనమైనచో, తదీయః = ఆ సంబంధుఁడవైన వాఁడవు, త్వమ్ = నీవు, భవసి = అగుచున్నావు, హే శంభో! = సుఖకరుఁడవైన ఈశ్వరుఁడా!, త్వమ్ = నీవు, భవభారం చ = (వాని) సంసారభారమును, వహసి = వహించు చున్నావు.

**మ. వడుగో, గేహియో, జోగియో, జటియొ యెవ్వండో యొకండేటికా**
**గొడవెవ్వానిమనస్సరోరుహము నీకుం బ్రాప్తమో వానినె**
**య్యుఁడవై యుండుటెకాక, యింకను దదీయోదగ్రసంసారపుం**
**బెడదల్ నీవె భరింతువయ్య కరుణాబ్ధీ! సర్వభూతేశ్వరా!.**

**తా :** బ్రహ్మచర్యమో, గార్హపత్యమో, వానప్రస్థమో, సంన్యాసమో, యీనాలుగాశ్రమములలోనే యాశ్రమమునందుండిన వాఁడైననేమి, యెవఁడు తన మనఃపద్మమును భగవంతునకు సమర్పించుచున్నాఁడో వాఁడు కైవల్యముఁజెందుచున్నాఁడు. ఆశ్రమములలో నేమియు లేదని తాత్పర్యము.

**శ్లో॥ గుహాయాం గేహే వా బహిరపి వనే వాద్రిశిఖరౌ**
**జలే వా వహ్నౌ వా వసతు వసతేః కిం వద ఫలమ్ ।**
**సదా యస్యైవాంతఃకరణమపి శంభో! తవ పదే**
**స్థితంచేద్యోగోఽసౌ స చ పరమయోగీ చ స సుఖీ ॥ 12**

**టీక :** గుహాయామ్ = పర్వతగుహయందుగాని, గేహే వా = గృహమునందుఁగాని, బహిరపి = బాహ్యప్రదేశమునఁగాని, వనే వా = అరణ్యమునందుఁగాని, అద్రిశిఖరౌ = కొండకొన యందుఁగాని, జలే వా = జలమునందుఁగాని, వహ్నౌ వా = అగ్నియందుఁగాని, వసతు

= వాసముచేయుఁగాక, వసతేః = వాసముచేయుటవలన, కిం ఫలమ్ = ఏమి ప్రయోజనము, వద = చెప్పుము, అంతఃకరణమపి = అంతరింద్రియమైనను, హే శంభో! = ఓ సుఖకరుఁడా!, సదా = ఎల్లప్పుడు, తవ = నీయొక్క, పదే = పదమునందు, స్థితంచేత్ = ఉన్నయెడల, అసౌ = ఇది, యోగః = శివయోగము, స చ = అట్లు నీపాదారవిందములయఁదుంచిన మనస్సుగల పురుషుఁడు, యోగీ చ = నిర్వికల్పసమాధిగల యోగియు (స చ = అతఁడు), సుఖీ చ = బ్రహ్మానందానుభవముగలవాఁడును అగుచున్నాఁడు.

**మ. గిరికూటంబుఁన, జిచ్చునన్, వనగుహాగేహంబులన్, నీళులన్**
**నరుఁడెందేని వసించుఁగాక ఫలమౌనాయంతమాత్రంబునన్? ।**
**నిరతం బెవ్వని యంతరింద్రియముగానీ త్వత్పదన్యస్తమై**
**తిరమై యుండుటె యోగ మాతఁడె కపర్దీ! యోగియున్ భోగియున్.**

**తా :** కొండగుహయందుగాని, బంచాగ్నిమధ్యమందుగాని, యరణ్యమునందుగాని యున్నంతమాత్రమున ప్రయోజనము లేదు. ఎక్కడనున్నను మనస్సు నీశ్వరార్పణము చేయుటే యోగము. అట్లు చేసినవాఁడే **బ్రహ్మజ్ఞాని** అని ముఖ్యతాత్పర్యము.

**శ్లో॥ అసారే సంసారే నిజభజనదూరే జడధియా**
**భ్రమంతం మామంధం పరమకృపయా పాతుముచితమ్ ।**
**మదన్యః కో దీనస్తవ కృపణరక్షాతినిపుణః**
**త్వదన్యః కో వా మే త్రిజగతి శరణ్యః పశుపతే! ॥ 13**

**టీక :** హే పశుపతే! = ఓ సకలభూతాధిపతీ!, అసారే = సారహీనమైనట్టియు, నిజభజనదూరే : నిజ = స్వస్వరూపుఁడైన యీశ్వరునియొక్క, భజన = ధ్యానించుటయే, దూరే = దూరముగాఁగలట్టియునగు, సంసారే = సంసారమునందు, జడధియా = వివేకశూన్యమైన బుద్ధితో, భ్రమంతమ్ = తిరుగుచున్నట్టి, అంధమ్ = ఆత్మానాత్మ పరిజ్ఞానశూన్యుడనయిన, మామ్ = నన్ను, పరమకృపయా = మిక్కిలిదయతో, పాతుమ్ = రక్షించుకొఱకు, ఉచితమ్ = యుక్తము, దీనః = సంసారపరితప్తుఁడుఐన దీనుఁడు, మదన్యః : మత్ = నాకంటె, అన్యః = వేఱొకఁడు, తవ = నీకు, కః = యెవఁడు (అస్తి = కలఁడు), కృపణ రక్షాతినిపుణః : కృపణ = దీనులయొక్క, రక్షా = సంరక్షించుటయందు, అతినిపుణః = మిక్కిలి సమర్థుఁడైనవాఁడు, త్వదన్యః : త్వత్ = నీకంటె, అన్యః = ఇతరుఁడు, మే = నాకు, త్రిజగతి = త్రిజగములయందు, శరణ్యః = రక్షింపఁదగినవాఁడు, కః = యెవఁడు (అస్తి = కలఁడు)

**మ. సారంబేమియులేక, త్వద్భజనవాంఛాదూరమౌ, ఘోరసం**
**సారంబందు భ్రమించునంధుని ననున్ మన్నింపఁజెల్లున్ గృపన్**

**లేరే నీకిఁక నన్నువంటి కృపణుల్ నీకంటె దీనావన**
**ప్రారంభుల్ త్రిజగంబులన్ మనుపువారల్ నాకు లేరీశ్వరా! .**

**తా** : అనఁగా సారహీనమైన సంసారమున మునింగిన నాకంటె నన్యుఁడు నీకెవఁడు రక్షింపఁదగినవాఁడు. లోకములయందు దీనులరక్షింప నీకంటె నన్యుఁడు నాకెవఁడు గలఁడు. కాబట్టి నన్ను రక్షించుట యుక్తము అని తాత్పర్యము.

**శ్లో॥ ప్రభుస్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే!**
**ప్రముఖ్యోఽహం తేషామపి కిముత బంధుత్వ మనయోః ।**
**త్వయైవ క్షంతవ్యాశ్శివ! మదపరాధాశ్చ సకలాః**
**ప్రయత్నాత్కర్తవ్యం మదవనమియం బంధుసరణిః ॥ 14**

**టీక :** హే పశుపతే! = ఓయీశ్వరుఁడా!, త్వమ్ = నీవు, ప్రభుః = (దీనభావనివర్తనుఁడవగు) ప్రభుఁడవు (కావుననే), దీనానామ్ = దీనులకు, పరమబంధుః ఖలు : పరమ = శ్రేష్ఠుఁడవైన, బంధుః ఖలు = బాంధవుఁడవుకదా, తేషామ్ = ఆ దీనులలో, అహమ్ = నేను, ప్రముఖ్యః = మొదటివాఁడను, అనయోః = మనకు, బంధుత్వమ్ = చుట్టఱికము, కిముత = వేఱేచెప్ప వలసినదేమి?, హే శివ! = ఓ ఆనందస్వరూపుఁడా!, సకలాః = సమస్తములైన, మదపరాధాః : మత్ = నాయొక్క, అపరాధాః = నేరములు, త్వయైవ = నీచేతనే, క్షంతవ్యాః = క్షమింపఁదగినవి, మదవనం : మత్ = నాయొక్క, అవనమ్ = రక్షణము, ప్రయత్నాత్ = యత్నము వలన, కర్తవ్యమ్ = చేయఁదగినది, ఇయమ్ = ఇది, బంధుసరణిః = చుట్టఱికపు పద్ధతి.

**శా. ఆపద్బంధుఁడవౌ ప్రభుండవుగదా, యాలాటియాపన్నులం**
**దే ప్రాముఖ్యుఁడనే నిఁకన్ మనకుఁ దంద్రీ! బంధుభావంబు వే**
**ఱే పల్కంబనిలేదుగాన శివ! నీవే సైఁచి నానేరముల్**
**కాపాడందగునెట్టులైన నిదియేకా బంధుమార్గంబనన్.**

**తా** : ఓ ఈశ్వరుఁడా! నీవు దీనబాంధవుఁడవు ప్రభుఁడవు నేనో దీనులలో నగ్రేసరుఁడను. కాబట్టి మన చుట్టఱికము చెప్పనక్కరలేదు. నేను నీకు చాలా దగ్గర చుట్టమును. కాబట్టి నన్ను రక్షింపుము అని తాత్పర్యము.

**శ్లో॥ విరించిర్దీర్ఘాయుర్భవతు భవతా తత్పరశిర-**
**శ్చతుష్కం సంరక్ష్యం స ఖలు భువి దైన్యం లిఖితవాన్ ।**
**విచారః కో వా మాం విశద! కృపయా పాతి శివ! తే**
**కటాక్షవ్యాపారస్స్వయమపి చ దీనావనపరః ॥ 15**

**టీక :** హే విశద! = ఓ నిర్మలస్వరూపా!, విరించిః = బ్రహ్మ, దీర్ఘాయుః = చిరాయుష్మంతుఁడు, భవతు = అవుఁగాక, భవతా = నీచేతను, తత్పరశిరశ్చతుష్కం : తత్ = ఆ పంచమ

శిరస్సుకంటె, పర = యితరమైన, శిరః = శిరస్సులయొక్క, చతుష్కమ్ = నాలుగు, సంరక్ష్యమ్ = రక్షింపఁదగినవి, సః = ఆ బ్రహ్మ, భువి = భూలోకమందు, దైన్యమ్ = దీనభావమును, లిఖితవాన్ ఖలు = వ్రాసినాఁడుకదా, దీనావనపరః : దీన = దీనులయొక్క, అవన = రక్షించుటయందు, పరః = ఆసక్తమైన, తే = నీయొక్క, కటాక్షవ్యాపారః : కటాక్ష = క్రేగంటి చూపులయొక్క, వ్యాపారః = వ్యాపారము, స్వయమపి = తనకుఁదానుగానే, మామ్ = నన్ను, రక్షతి = రక్షించుచున్నది. విచారః = విచారము, కో వా = యేమున్నది.

**మ. భువి దైన్యంబు లిఖించునాతనిశిరంబుల్ నాలుగే నిల్పి శ్రీ**
**శివ! దీర్ఘాయువుగా మొనర్పుము విరించిన్ మాకుఁగాసంత దా**
**న విచారంబదియేల సంతతము దీనత్రాణపారీణమౌ**
**భవదీయోరుకటాక్షపుంబ్రకృతియే పాలింపఁదానై ననున్.**

**తా** : ఎల్లప్పుడు స్వయముగా దీనులను రక్షించుటయందు నాసక్తమైన నీకటాక్షము నను రక్షించుచుండగా బ్రహ్మయొక్క దీనపువ్రాతనన్నేమి చేయఁగలదు. బ్రహ్మ దీర్ఘాయువుగా నుండనిమ్ము అని తాత్పర్యము.

**శ్లో॥ ఉపేక్షా నోచేత్ కిన్న హరసి భవద్ధ్యానవిముఖాం**
**దురాశాభూయిష్ఠాం విధిలిపిమశక్తో యది భవాన్ ।**
**శిరస్తద్వైధాత్రం న నఖలు సువృత్తం పశుపతే!**
**కథం వా నిర్యత్నం కరనఖముఖేనైవ లులితమ్ ॥ 16**

**టీక :** హే పశుపతే! = ఓ ఈశ్వరా!, (మదవనే = నా రక్షణమునదు), ఉపేక్షా = అసడ్డ, నోచేత్ = లేకపోయినచో, దురాశాభూయిష్ఠాం : దురాశా = దుష్టవిషయేచ్ఛల చేత, భూయిష్ఠామ్ = మిక్కిలి విస్తారమైనది కనుకనే, భవద్ధ్యానవిముఖాం : భవత్ = నీ యొక్క, ధ్యాన = చింతననుండ, విముఖామ్ = మరలినదియగు, విధిలిపిమ్ = బ్రహ్మ వ్రాతను, కిమ్ = ఏల, నహరసి = తుడిచివేయకున్నావు, అశక్తో యది = (అందుకు) సమర్థుడవు కానిచో, భవాన్ = నీవు, న నఖలు = గోటితోగిల్లశక్యము కానిదియు, తత్ = అను ప్రసిద్ధమైన, వైధాత్రమ్ = విధాతృసంబంధమైన, శిరః = (పంచమ) శిరస్సును, నిర్యత్నమ్ = అప్రయత్నముగా, కరనఖముఖేనైవ : కర = హస్తముయొక్క, నఖ = గోటియొక్క, ముఖేనైవ = కొనచేతనే, కథం వా = యెట్లుగా, లులితమ్ = గిల్లివేయఁబడినది.

**మ. నను రక్షింపనుపేక్షయే కలుగకున్నన్ నీకు, నత్యాశలన్**
**నిను ధ్యానింపఁగనీని బ్రహ్మలిపినేనిన్ మార్పవే? చేతగా**
**దనివన్ గోటికశక్యమై దృఢతరంబౌనల్వమో మెట్లుగా**
**స్వనఖాగ్రంబున గిల్లినాఁడవు మహేశా! నీవు నిర్యత్నతన్?.**

**తా** : ఓ పరమేశ్వరుఁడా! నన్ను రక్షించుటయందుపేక్ష చేయుచున్నావు. లేనిచో దురాశా భూయిష్ఠమైన బ్రహ్మవ్రాతను నేల పోగొట్టవు. అట్లు చేయుటకు చేతగాని వాఁడవందువేని బ్రహ్మశిరంబునే గిల్లి వేసినవాఁడవు. బ్రహ్మవ్రాతను తుడిచివేయఁజాలవా! నిగ్రహా- నుగ్రహసమర్థుఁడవు. నీవు నన్ను రక్షింపవలయునని తాత్పర్యము.

**శ్లో॥ ఫలాద్వా పుణ్యానాం మయి కరుణయా వా త్వయి విభో!**
**ప్రసన్నేఽపి స్వామిన్! భవదమలపాదాబ్జయుగళమ్ ।**
**కథం పశ్యేయం మాం స్థగయతి నమస్సంభ్రమజుషాం**
**నిలింపానాం శ్రేణిర్నిజకనకమాణిక్యమకుటైః ॥ 17**

**టీక :** హే విభో! = ఓయి సర్వవ్యాపకుఁడా!, మమ = నాయొక్క, పుణ్యానామ్ = పుణ్యములయొక్క, ఫలాద్వా = ఫలమువల్లయో, కరుణయా వా = కరుణచేతయో, హే స్వామిన్! = సకల దేవతలకు ప్రభువైన ఈశ్వరుఁడా! మయి = నా విషయమై, త్వయి = నీవు, ప్రసన్నే సతి = అనుగ్రహము గలవాఁడవగుచుండగా, భవదమలపాదాబ్జయుగళం : భవత్ = నీయొక్క, అమల = స్వచ్ఛములైనట్టి, పాదాబ్జ = కమలముల వంటి పాదములయొక్క, యుగళమ్ = ద్వంద్వమును, అహమ్ = నేను, కథమ్ = ఎట్లుగాను, పశ్యేయమ్ = చూచెదను, నమస్సంభ్రమజుషాం : నమః = నమస్కారమందు, సంభ్రమ = సంతోషమును, జుషామ్ = పొందినట్టి, నిలింపానామ్ = దేవతలయొక్క, శ్రేణిః = పఙ్క్తి, నిజకనకమాణిక్యమకుటైః : నిజ = స్వకీయములైనట్టి, కనక = సర్వవికారములైనట్టి, మాణిక్య = కెంపులు చెక్కబడ్డయు, మకుటైః = కిరీటములచేతను, మామ్ = నన్ను, స్థగయతి = కప్పుచున్నది.

**ఉ. మామకపూర్వపుణ్యమహిమంబుననో భవదీయనైజపుం**
**బ్రేముడినో ప్రసన్నతను వేవహియించితిగాని యెట్టులో**
**స్వామి! త్వదీయపాదవనజంబులఁగాంతును? వందమాననా**
**నామరహేమరత్నమకుటావళి నాకనుగప్పుచుండఁగన్.**

**తా** : అనగా సకలబ్రహ్మాండములయందు నిండి యున్నట్టి సకలదేవతలకు ప్రభువైనట్టి ఓ పరమేశ్వరుఁడా! నా పుణ్యఫలమువల్లగాని నీ వాత్సల్యముచేతగాని నా విషయమై నీవు ప్రసన్నుఁడవైనను నీ దర్శనభాగ్యమునకై సంభ్రమంబు దేవతాసమూహముల సమ్మర్దముచే నీ దర్శనము నాకు లభించు చుండుట లేదని తాత్పర్యము.

**శ్లో॥ త్వమేకో లోకానాం పరమఫలదో దివ్యపదవీం**
**న హంతస్త్వన్మూలాం పునరపి భజంతే హరిముఖాః ।**
**కియద్వా దాక్షిణ్యం తవ శివ! మదాశా చ కియతీ**
**కదా వా మద్రక్షాం వహసి కరుణాపూరితదృశా ॥ 18**

**టీక :** హే శివ! = సుఖస్వరూపుఁడవైన యీశ్వరుఁడా!, లోకానామ్ = జనులకు, పరమఫలదః = మోక్షఫలము నిచ్చువాఁడవు, త్వమ్ = నీవు, ఏకః = ఒక్కఁడవే, హరిముఖాః = విష్ణువు మొదలగువారు, త్వన్మూలామ్ = నీవే కారణముగాఁగలిగిన (నీవొసంగిన), దివ్యపదవీమ్ = వైకుంఠము మొదలగు దివ్యస్థానమును, వహంతః = పొందుచున్నవారై, పునరపి = మరల (ఉత్తమ ఫలప్రాప్తికై) భజంతే = (నిన్నే) సేవించు చున్నారు. తవ = నీ యొక్క, దాక్షిణ్యమ్ = భక్తాభిప్రాయానుసరణము, కియద్వా = ఎంత పరిమాణము కలది (పరిమితి లేనిదనుట), మదాశా చ = నా యొక్క ఆశయు, కియతీ = ఎంతటిది? (ఇంతయని యెఱుఁగననుట), మద్రక్షాం : మత్ = అహంకారమునుండి, రక్షామ్ = నా సంరక్షణమును, కరుణాపూరితదృశా = సంపూర్ణకటాక్ష వీక్షణముతో, కదా = ఎన్నఁడు, వహసి = చేయుదువు.

మ. **అరయన్ నీవొకరుండవే జనులకామ్యార్థంబులన్ దీర్ప నా**
**హరిధాత్రాదులు నీవె మూలమగు దివ్యస్థానముల్ పొందియున్**
**మరలన్ నిన్నె భజింత్రు నీకరుణ యేమాత్రంబొ నాయాసకే**
**పరిమాణంబొ యెఱుంగఁ(బోతు నను దేవా! సత్కృపాదృష్టులన్.**

**తా :** ఆనందస్వరూపుఁడవైన ఓ మహాదేవా!, మోక్షమిచ్చు మహానుభావుఁడవు నీవొక్కఁడవే. విష్ణ్వాదులు నీదయచేతనే వైకుంఠ వాసులైరి. అయ్యును తనివి నొందక నీవలన పదవులను గోరుచునే యుందురు. ఆహా! భక్తులమీఁద నీకెంత దయ? నా యాశ యెంత యని చెప్పుదు. సాంబశివా! సంపూర్ణకటాక్షము గలిగి అహంభావమును బాపి నన్ను రక్షించుము.

శ్లో॥ **దురాశాభూయిష్ఠే దురధిపగృహద్వారఘటకే**
**దురంతే సంసారే దురితనిలయే దుఃఖజనకే ।**
**మదాయాసం కిం న వ్యపనయసి కస్యోపకృతయే**
**వదేయం ప్రీతిశ్చేత్తవ ఖలు కృతార్థా వయమపి ॥** **19**

**టీక :** దురాశాభూయిష్ఠే = దుష్టవిషయములయందలి యాశచే మిక్కుటమైనదియు, దురధిపగృహద్వారఘటకే = దుష్టప్రభువుల మందిరద్వారములకుఁ జేర్చునదియు, దురంతే = దురవసానముగలదియు, దురితనిలయే = పాపములకునికిపట్టును, దుఃఖజనకే = దుఃఖహేతువునైన, సంసారే = జననమరణప్రవాహరూపమైన సంసారమందు, మదాయాసమ్ = నా పరిశ్రమమును, కస్య = బ్రహ్మదేవునియొక్క, ఉపకృతయే = ఉపకారము కొఱకు, న వ్యపనయసి కిమ్=పోఁగొట్టకుంటివా యేమి?, వద=చెప్పుము, ఇయమ్ = ఈ (భక్తుల యాసకామము గుఱించిన), ప్రీతిః=ప్రేమ, తవ = నీకు, చేత్ = కలిగియున్నచో, వయమపి = (నిన్ను భజించుచున్న వారమైన) మేమును, కృతార్థాః ఖలు = కృతార్థులమే గదా.

మ. **దురితాలంబము, దుఃఖమూలము, దురుద్యోగంబనంతంబు, దు**
**స్తర దుష్కామమనికామమున్ దురధిపద్వారానుసంధానమౌ**

**నురుసంసారములోని నావెతల శంభూ! బ్రహ్మకైమాన్పవేన్**
**స్థిరతద్భక్తపరత్వమే మముఁ గృతార్థీభూతులం జేయదే.**

**తా** : మృత్యుంజయా! దురాశలచేత దుష్టప్రభువుల గృహద్వారములయందుఁ బడి కొట్టుకొనుచు పలుదుఃఖముల పాలు గావలసిన తుదిలేని సంసారమందలి నాపరిశ్రమల నేల నశింపఁజేయవు? నీ భక్తుఁడుగా నున్న బ్రహ్మదేవుని మీఁది వాత్సల్యము చేత నాతని చేఁతలు చెఱుపనొల్లమిఁ గాబోలు. సరే నీవు భక్తవత్సలుఁడవై నప్పుడు మాకేమి లోపము? నిన్ను భజించి నేనును గృతార్థుఁడ నగుదుఁ గదా!

**శ్లో॥ సదా మోహాటవ్యాం చరతి, యువతీనాంకుచగిరౌ**
**నటత్యాశాశాఖాస్వటతి, ఝుడితి స్వైరమభితః ।**
**కపాలిన్! భిక్షో! మే హృదయకపిమత్యంతచపలం**
**దృఢం భక్త్యా బద్ధ్వా శివ! భవదధీనం కురు విభో! ॥ 20**

**టీక :** కపాలిన్! = బ్రహ్మకపాలము ధరించినవాఁడవును, విభో! = సర్వవ్యాపకుఁడవును, శివ = ఆనందస్వరూపుఁడవును, భిక్షో! = ఆదిభిక్షుఁడవునగు యో దేవా!, సదా = ఎల్లప్పుడును, మోహాటవ్యామ్ = సంసారవాంఛయను మహారణ్యమందు, చరతి = సంచరించుచున్నది, యువతీనామ్ = జవ్వనులయొక్క, కుచగిరౌ = స్తనములనియెడు పర్వతమందు, నటతి = ఆటలాడుచున్నది, ఆశాశాఖాసు = దారపుత్రాదులయందలి ప్రేమయను కొమ్మలయందు, అటతి = దుముకులాడుచున్నది, ఝుడితి = శీఘ్రముగా, అభితః = నలువంకలను, ఆటతి = పరుగులిడుచున్నది, అత్యంతచపలమ్ = మిక్కిలి చంచలమైన, మే = నాయొక్క, హృదయకపిమ్ = మనస్సనియెడు కోఁతిని, దృఢమ్ = గట్టిగా, భక్త్యా = భక్తియనెడు త్రాటితో, బద్ధ్వా = కట్టి, భవదధీనమ్ = నీ వశముగా, కురు = చేసికొనుము.

**మ. వలవుం గానలసంచరించు, యువతీవక్షోజదుర్గంబులన్**
**సలుపున్నాట్యము నిచ్చలున్ దుముకు నాశాశాఖలం దెల్లచోఁ**
**జెలఁగున్ స్వేచ్ఛగఁ జంచలంబయిన మచ్చిత్తంపుఁబెంగ్రోఁతి, ని**
**స్తుల భక్తిచ్ఛలసూత్రబంధమున, భిక్షూ! దాని బంధింపుమీ.**

**తా** : కోఁతి వలె సంసారారణ్యమందు చంచలముగా దిరుగుచున్న నా చిత్తమును భక్తియను గట్టి త్రాటితో బిగియఁగట్టి నీ స్వాధీనపఱచుకొనుము. నా చిత్తమునకు త్వదేకశరణమైన భక్తి ననుగ్రహింపు మని భావము.

**శ్లో॥ ధృతిస్తంభాధారాం దృఢగుణనిబద్ధాం సగమనాం**
**విచిత్రాం పద్మాఢ్యాం ప్రతిదివససన్మార్గఘటితామ్ ।**

**స్మరారే! మచ్చేతస్స్ఫుటపటకుటీం ప్రాప్య విశదాం**
**జయ స్వామిన్! శక్త్యాసహ శివ! గణైస్సేవిత! విభో! ॥ 21**

**టీక :** హే స్మరారే! = కామునికి శత్రువయినవాఁడా!, భో స్వామిన్! = సకల లోకములను వశపఱచుకొనినవాఁడా!, గణైః = స్వరూపమును విమర్శించెడు గణముచేత, సేవిత = ధ్యానింపఁ బడువాఁడా!, హే విభో! = ఓ సర్వవ్యాపకుఁడా!, హే శివ! = అఖండానంద స్వరూపుఁడవగు పరమేశ్వరా!, ధృ... రాం : ధృతి = ధైర్యమనియెడు, స్తంభ = నిట్రాడు, ఆధారామ్ = ఆధారముగాఁగలదియు, దృ..ర్ధాం : దృఢ = దృఢమైన, గుణ = త్రిగుణ కార్యములగు దేహాదులనియెడు త్రాళ్లతో, నిబద్ధామ్ = నిలువఁ బడినదియు, సగమనామ్ = ఎచ్చటికి కావలయునన్నను పోవునదియు, విచిత్రామ్ = విచిత్ర (వాసనలనియెడు) నానారంగులు గలదియు, పద్మాఢ్యామ్ = లక్ష్మీయుక్తమును, పద్మములవంటి చిత్తరువులతో నొప్పునదియు, ప్ర... తాం : ప్రతి దివస = ప్రతిదినమందును, సన్మార్గఘటితామ్ = బ్రహ్మవిచారమందు చేరిక గలదియు, రాజమార్గమందమర్పఁ బడినదియు, విశదామ్ = నిర్మలమైనదియు, మ.. టీమ్ : మచ్చేతః = నా చిత్తమనియెడు, స్ఫుటపటకుటీమ్ = స్ఫుటమైన డేరాను, ప్రాప్య = పొంది (ప్రవేశించి), శక్త్యాసహ = పార్వతీదేవితోఁగూడ, జయ = సర్వోత్కర్షతో నుండుము.

మ. **ధృతియన్గంబమె యూఁతగా, దృఢగుణాప్తింబొల్చి పద్మాసమం**
**చితమై, సత్పథగామియై, విశదమై, చిత్రాద్భుతంబైన మ**
**త్స్ఫుతచేతఃపటమందిరంబున, స్మరారీ! గౌరితోఁగూడ సం**
**తతమానందమునన్ వసింపవె జగన్నాథా! గణశ్రేణితోన్.**

**తా :** కామజయము గలిగి సర్వస్వతంత్రుఁడవును సర్వవ్యాపకుఁడవును పరమానంద స్వరూపుఁడవును నగు నో పార్వతీవల్లభా! నా చిత్తమిపుడొక గుడారముగా నున్నది. అది యెట్లన, గుడార మొక నిట్రాటి కొయ్యపై నిలిచి యుండును నా చిత్తకుటీరమును విషయ నిత్యత్వావధారణమనియెడు నిట్రాటిపై నిలిచి యున్నది. గుడారము త్రాళ్లతో బిగియఁగట్టి నిలుపఁబడును. చిత్తమును సత్వరజస్తమోగుణముల వలని జనించిన దేహాదులతో నిలుపఁ బడియున్నది. గుడార మెక్కడకు కావలయునన్నను దీసికొని పోవచ్చును. చిత్త మచ్చటచ్చటకుఁ బోవుచుండును గదా! గుడార మనేక రంగులును పద్మములవంటి చిత్రములును గలిగి మంచి మంచి రాజమార్గములయం దమర్పఁబడి యుండును. నా చిత్తము నానావిధములగు జన్మాంతర దుర్వాసనలతోఁ గూడి నిరతము సంపదను గోరుచున్నది. మఱియు బ్రహ్మవిచారమునందు ఘటింపఁబడి యున్నది. ఇట్టి నా చిత్తకుటీరమందు శక్తిసమేతుండవై నివసించి యుండుము.

**శ్లో॥ ప్రలోభాద్యైరర్థాహరణపరతంత్రో ధనిగృహే**
**ప్రవేశోద్యుక్తస్సన్ భ్రమతి బహుధా తస్కరపతే! ।**
**ఇమం చేతశ్చోరం కథమిహ సహే శంకర! విభో!**
**తవాధీనం కృత్వా మయి నిరపరాధే కురు కృపామ్ ॥ 22**

**టీక :** హే తస్కరపతే! = చోరులకు ప్రభువైనవాఁడా!, హే శంకర! = భక్తులకు సుఖము గలుగఁజేయువాఁడా!, హే విభో! = ఓ మహాప్రభో!, ప్రలోభాద్యైః = వశీకరణము మొదలగు నుపాయములచేత, అ.. త్రః : అర్థాహరణ = ధనాకర్షణమందు, పరతంత్రః = ఆశక్తి గలవాఁడై, చేతశ్చోరః = చిత్తమనియెడు దొంగ, ధనిగృహే = ధనవంతుని యింటి యందు, ప్రవేశోద్యుక్తస్సన్ = ప్రవేశింప నుద్యుక్తుఁడగుచు, బహుధా = అనేకవిధములుగా, భ్రమతి = తిరుగుచున్నాఁడు, ఇమమ్ = ఈ, చేతశ్చోరమ్ = చిత్తమనియెడు దొంగను, కథమ్ = ఎట్లుగా, సహే = సహింతును, ఇహ = ఇప్పుడు, తవ అధీనం కృత్వా = నీ వశము జేసికొని, నిరపరాధే = అపరాధము లేనట్టి, మయి = నాయందు, కృపామ్ = దయను, కురు = చేయుము, (దొంగను పట్టుట పక్కా దొంగవలననే నెఱవేఱవలెను. కావున నా చిత్తచోరుని గడిదొంగవగు నీవే పట్టవలెననియు, దొంగ దొంగల జట్టులోనే యుండవలెగాన నీవే యుంచుకొమ్మనియుఁ జిత్రితము. దొంగను మంచి జేసికొనినచో దొంగల భయము లేదు.)

మ. అకటా! యేగతినే సహించెద మహాత్మా! నామనశ్చోరుఁడో
డక ద్రవ్యాహరణప్రవృత్తి ధనియింటంగన్న పెట్టంగ నూ
రక తారాడుచునున్న వాఁ డతనిఁజేరందీసి బంధించి యొ
ద్దికమై తస్కరనాథ! న న్నిరపరాధిన్ జేసి రక్షింపుమా!.

**తా** : లేనిపోని కల్లబొల్లి మాటలు చెప్పి ధనికుల చిత్తమును వశపఱచుకొనుటమున్ను గాఁ గొన్ని దుష్టోపాయములు పన్ని ధనాకర్షణమునకుఁగా ధనవంతులయిండ్లఁ దూఱుచు తిరుగులాడుచున్న యీ నా చిత్తం బనుచోరుని నేనోర్వలేను. నీ కప్పగించెదను. నీ వశము జేసికొని నిరపరాధినగు నన్ను దయతో రక్షింపుము.

**శ్లో॥ కరోమి త్వత్పూజాం సపది సుఖదో మే భవ విభో!**
**విధిత్వం విష్ణుత్వం దిశసి ఖలు తస్యాః ఫలమితి ।**
**పునశ్చ త్వాం ద్రష్టుం దివి భువి వహన్ పక్షిమృగతా–**
**మదృష్ట్వా తత్ఖేదం కథమిహ సహే శంకర! విభో! ॥ 23**

**టీక :** హే విభో! = ఓ మహాదేవా!, త్వత్పూజామ్ = నీయారాధనమును, కరోమి = చేయుదును, సపది = తత్ క్షణమే, ఓ శంకర! = ఓ సుఖకరమైనవాఁడా!, మే = నా

కొఱకు, సుఖదః = నిత్యసుఖము నిచ్చువాఁడవు, భవ = అగుము, తస్యాః = ఆ పూజకు, విధిత్వమ్ = బ్రహ్మయగుట, విష్ణుత్వమ్ = విష్ణువగుట, ఫలమితి = ఫలమని, దిశసి ఖలు = ఇత్తువు గదా, పునశ్చ = మరల నిటుమీఁదను, దివి = ఆకాశమందును, భువి చ = భూమియందును, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, పక్షిమృగతామ్ = హంస పక్షిరూపము గానీ వరాహరూపముగానీ, వహన్ = ధరించుచు, అదృష్ట్వా = చూడలేక, తత్ఖేదమ్ = పక్షిమృగములుగాఁ బుట్టుటవలని దుఃఖమును, కథమ్ = ఎట్లుగా, సహే = సహింతును, విభో! = మహాప్రభో!.

శా. ధ్యానింతున్ నినుఁ దత్ఫలంబుగను బ్రహ్మత్వంబొ విష్ణుత్వమో
కానీ యొల్ల, దివిన్ భువిన్ ఖగమృగాకారంబులన్ దాల్చి నిన్
గానంజాలని జాలిలో మునిఁగి వేగంజాల వేయేల ని
త్యానందానుభవంబు నాకొసఁగుమయ్యా యయ్య భద్రప్రదా!.

**తా** : ఓ సాంబశివా! నిన్నారాధింతును. నాకు పూజాఫలముగా మోక్షానంద మొసంగుము. కాని బ్రహ్మత్వమో విష్ణుత్వమో దానికి ఫలమని మాత్రమియ్యవద్దు. అక్కడనుండి హంసగానో పందిగానో పుట్టి నీ పాదములను శిరస్సును కనుఁగొనుటకు పదునాలుగు లోకములుం దిరిగి శ్రమపడలేను. ఆ మీఁద తుదకు నిన్ను కన్గొననేరక క్షుద్రజన్మవలని యవమానమును సహింపనేరను. కాన బ్రహ్మవిష్ణు లోకానందముల కన్న నధికమైన సాయుజ్యముక్తి యను పరమానందము దయచేయుమని తాత్పర్యము.

శ్లో॥ కదా వా కైలాసే కనకమణిసౌధే సహగణై-
ర్వసన్ శంభోరగ్రే స్ఫుటఘటితమూర్ధాంజలిపుటః ।
విభో! సాంబ! స్వామిన్! పరమ! శివ! పాహీతి నిగదన్
విధాతౄణాం కల్పాన్ క్షణమివ వినేష్యామి సుఖతః ॥ **24**

**టీక :** కైలాసే = శివనివాసస్థానమగు కైలాసమందు, కనకమణిసౌధే = బంగారు రత్నాలమిద్దె మీఁద, గణైస్సహ = ప్రమథగణములతోఁగూడ, శంభోః = పరమశివునియొక్క, అగ్రే = ముందర, వసన్ = ఉన్నవాఁడవై, స్ఫు...టః : స్ఫుటఘటిత = దృఢముగా కూర్చఁబడిన, మూర్ధాంజలిపుటః = శిరస్సునందలి అంజలి బంధము గలవాఁడవగుచు, భో విభో!, భో సాంబ!, భో స్వామిన్!, భో పరమ, భో శివ!, పాహి = రక్షింపుము, ఇతి = ఇట్లు, నిగదన్ = పలుకుచున్నవాఁడనై, సుఖతః = అట్టి యానందానుభవము వలన, విధాతౄణాం కల్పాన్ = అనేక బ్రహ్మ కల్పములను, క్షణమివ = నిమేషమాత్రముగా, కదా వా = ఎప్పుడు, వినేష్యామి = గడుపుదునో.

మ. అల కైలాసనగంబులోఁ గనకమణ్యాకల్పసౌధంబులో
పల సద్భక్తగణంబుతో శివపురోభాగంబునన్ మోడ్పుఁగై
యలరన్ సాంబ! శివా! పరాత్పర! మహేశా! పాహియం చెప్పుడి
మ్ముల వెళ్లించెదనో క్షణంబటు సతంబున్ బ్రహ్మకల్పంబులన్.

**తా :** శివస్థానమైన కైలాసమునకుఁ జేరి ప్రమథగణములతోఁ గూడ పరమేశ్వరుని యెదుట హే విభో!, హే సాంబ!, హే స్వామిన్!, హే పరమశివ! పాహి, పాహి యని పలుకుచు సంతోషముతో అనేక బ్రహ్మకల్పములు నిమేషంబులుగాఁ గాలమెప్పుడు గడపుదునో గదా!

**శ్లో॥ స్తవైర్బ్రహ్మాదీనాం జయ జయ వచోభిర్నియమినాం
గణానాం కేళీభిర్మదకలమహోక్షస్య కకుది ।
స్థితం నీలగ్రీవం త్రిణయనముమాశ్లిష్టవపుషం
కదా త్వాం పశ్యేయం కరధృతమృగం ఖండపరశుమ్ ॥ 25**

**టీక :** బ్రహ్మాదీనామ్ = నియమవంతులగు మహర్షులయొక్క, స్తవైః = స్తోత్రములతోడను, నియమినామ్ = నియమవంతులగు మహర్షులయొక్క, జయ జయ వచోభిః = జయ జయధ్వనులతోడను, గణానామ్ = ప్రమథగణములయొక్క, కేళీభిః = క్రీడలతోడను, మదకలమహోక్షస్య = సంతోషాతిశయమున సొంపుగా నున్న వృషభముయొక్క, కకుది = మూఁపురమునందు, స్థితమ్ = ఉన్నట్టివాఁడును, నీలగ్రీవమ్ = నల్లని కంఠముగలవాఁడును, త్రిణయనమ్ = మూఁడుకన్నులు గలవాఁడును, ఉమాశ్లిష్టవపుషమ్ = పార్వతీదేవిచేత నాలింగనము చేసికొనఁబడిన దేహము గలవాఁడును, కరధృతమృగమ్ = చేతితో పట్టుకొనఁబడిన లేడి గలవాఁడును, ఖండపరశుమ్ = ఖండమైన గండ్రగొడ్డలి గలవాఁడును నగు, త్వామ్ = నిన్నును, కదా వా = ఎప్పుడు, పశ్యేయమ్ = చూతును.

మ. పరమేష్ఠిప్రముఖామరుల్ నిలిచి కైవారంబుసేయన్, మునీ
శ్వరకోటుల్ జయవెట్టగాఁ బ్రమథు లిచ్ఛాకేళిఁదేలంగఁ బీ
వర నందీశ్వరుపై నుమారమణితో భాసిల్లుమానీలకం
ధరు సారంగధరున్ నినున్ గనుల నెన్నం డింపుగాఁజూతునో.

**తా : స్తోత్రపాఠములతో బ్రహ్మాదులును జయజయధ్వనులతో మహర్షులును ఆటపాటలతో బ్రమథగణంబులుం గొలువ పార్వతీసమేతుండవై వృషభవాహనము మీఁద వేంచేసియున్న నీ సందర్శనము జేయు భాగ్యము నాకెన్నఁడు లభించునో గదా!**

**శ్లో॥ కదా వా త్వాం దృష్ట్వా గిరిశ! తవ భవ్యాంఘ్రియుగళం
గృహీత్వా హస్తాభ్యాం శిరసి నయనే వక్షసి వహన్ ।**

**సమాశ్లిష్యాఘ్రాయ స్ఫుటజలజగంధాన్ పరిమళా-**
**నలభ్యాం బ్రహ్మాద్యైర్ముదమనుభవిష్యామి హృదయే ॥ 26**

**టీక :** హే గిరిశ! = పర్వతశాయివగు నో యీశ్వరా!, త్వామ్ = నిన్ను, దృష్ట్వా = చూచి, తవ = నీ యొక్క, భవ్యాంఘ్రియుగళమ్ = క్షేమకరమైన పాదములను, హస్తాభ్యామ్ = చేతులతో, గృహీత్వా = పట్టుకొని, శిరసి = శిరస్సునందును, నయనే = నేత్రమందును, వక్షసి = వక్షస్థలమందును, వహన్ = చేర్చుకొనుచున్నవాఁడనై, సమాశ్లిష్య = కౌఁగిలించుకొని, స్ఫుటజలజగంధాన్ = వికసించిన పద్మములయొక్క సుగంధమువంటి సుగంధముగల, పరిమళాన్ = పరిమళములను, ఆఘ్రాయ = మూర్కొని, బ్రహ్మాద్యైః = బ్రహ్మ మొదలగువారిచేత, అలభ్యామ్ = పొందశక్యము గాని, ముదమ్ = సంతోషమును, హృదయే = హృదయమునందు, కదా వా = ఎప్పుడు, అనుభవిష్యామి = అనుభవింతును.

మ. **కనుగొంచున్ భవదీయభవ్యపదయుగ్మంబంటి చేదోయితోఁ**
**గనులందున్ దలయందు నక్కునను జక్కందాల్చి వే కౌఁగిలిం**
**చి నినున్ విస్ఫుటపద్మగంధరుచిర శ్రీసౌరభం బానుచున్**
**మనమం దెన్నడు గాంతునో నలువకైనన్ దుర్లభంబౌ సిరిన్.**

**తా** : దేవా! నినుఁ జూచి నీ పాదములను చేతులతోఁ బట్టి శిరస్సు నందును నేత్రములయందును ఱొమ్మునను జేర్చి కౌఁగిలించుకొని అందలి పద్మగంధముల నాఘ్రాణించి బ్రహ్మాదులకును దొరకని యానందము నెప్పుడు బొందుదునో గదా!

**శ్లో॥ కరస్థే హేమాద్రౌ గిరిశ! నికటస్థే ధనపతౌ**
**గృహస్థే స్వర్భూజామరసురభిచింతామణిగణే ।**
**శిరస్థే శీతాంశౌ చరణయుగళస్థేఽఖిలశుభే**
**కమర్థం దాస్యేఽహం భవతు భవదర్థం మమ మనః ॥ 27**

**టీక :** హే గిరిశ! = పర్వతశాయివగు యో యీశ్వరుఁడా!, హేమాద్రౌ = మేరుపర్వతము (బంగారు కొండ), కరస్థే = చేతిలోనుండఁగా, ధనపతౌ = కుబేరుఁడు (ధనవంతుఁడు), నికటస్థే = దగ్గఱనుండఁగా, స్వ... ణే : స్వర్భూజ = కల్పవృక్షములయొక్కయు, అమరసురభి = కామధేనువు యొక్కయు, చింతామణి = చింతామణులయొక్కయు, గణే = సమూహము, గృహస్థే = ఇంటిలోనుండఁగా, శీతాంశౌ = చంద్రుఁడు, శిరస్థే = శిరస్సుననుండఁగా, అఖిలశుభే = సమస్తశుభమును, చరణయుగళస్థే = పాదద్వంద్వమందుండఁగా, కమ్ =ఏ, అర్థమ్ = ఇష్టార్థమును, అహమ్ = నేను, దాస్యే = మీకిత్తును, మమ = నాయొక్క మనః = మనస్సు, భవదర్థమ్ = నీకొఱకు, భవతు = అగుఁగాక.

మ. తలఁపన్ జేతఁబసిండికొండ, సరసన్ ద్రవ్యాధ్యుఁడున్ గీము ముం
దల మందారతరూల్లసత్సురభి చింతారత్న సంతానముల్
తలపై బాలసుధాకరుండు, చరణద్వంద్వంబునందెల్ల మం
గళముల్గల్గిన నీకు నామనసుదక్కన్ లాతి యేమిచ్చెదన్?

**తా** : కైలాసవాసా! మహాదేవా! బంగారుకొండ కోదండముగా నీ చేతనున్నది. మహాధనదుండగు కుబేరుండు మిత్రుఁడుగా నీపజ్జ నున్నవాఁడు. కోరినమాత్రముననే యెల్ల కోరికల నిచ్చు కల్పవృక్షములు కామధేనువు చింతామణులును నీయధీనములుగా నీయింట నున్నవి. ఆహ్లాదకరుండగు చంద్రుండు భూషణంబుగా నీశిరస్సున నున్నవాఁడు. సమస్తశుభంబులును నీపాదముల వలనన కలుగుచున్నవి. సాంబశివా! నేనొసంగఁ దగిన దొండును గానరాదు. గావున నా చిత్తము నర్పించెదఁ జేకొనుము.

**శ్లో॥ సారూప్యం తవ పూజనే శివ! "మహాదేవే"తిసంకీర్తనే**
**సామీప్యం శివభక్తిధుర్యజనతాసాంగత్య సంభాషణే ।**
**సాలోక్యం సచరాచరాత్మకతనుధ్యానే భవానీపతే!**
**సాయుజ్యం మమ సిద్ధమత్ర భవతి స్వామిన్! కృతార్థోఽస్మ్యహమ్ ॥28**

**టీక :** భో స్వామిన్! = ఓసర్వాధ్యక్షుఁడా?, తవ = నీయొక్క, పూజనే = పూజ చేసినప్పుడు, సారూప్యమ్ = సమానరూపముబొందుటయు, శివ! మహాదేవేతి సంకీర్తనే = హే శివా!, హే మహాదేవా! అని యిట్లు కీర్తించినప్పుడు, సామీప్యమ్ = సమీపమందుండుటయు, శివ..ణే : శివభక్తిధుర్య = ఈశ్వరభక్తియను భారమును వహించుచున్న, జనతా = జనసమూహముయొక్క, సాంగత్యసంభాషణే = సహవాసము, సల్లాపమును గలిగినప్పుడు, సాలోక్యమ్ = ఒక్క లోకమందునికియు, హే భవానీపతే! = ఓ సాంబమూర్తీ!, చ...నే : చరాచరాత్మక = స్థావరజంగమరూపమైన, తను = మూర్తియొక్క, ధ్యానే = ధ్యానము చేసినప్పుడు, సాయుజ్యమ్ = నీతోడనైక్యమును, మమ = నాకు అత్ర = ఈ జన్మమందు, సిద్ధం భవతి = సిద్ధించుచున్నది. (అతః = కనుక), అహమ్ = నేను, కృతార్థః = ధన్యుఁడను, అస్మి = అగుచున్నాను.

మ. సరవిన్ నీపదపూజచే స్తవముచే సారూప్యసామీప్యముల్
సరసాత్మజ్ఞుల సాహచర్యకలనన్ సాలోక్యసౌభాగ్యమున్
హర! గౌరీశ! చరాచరాత్మకతనుధ్యానంబుచే నిప్పు డ
క్షర సాయుజ్యపదంబు గాంచి జగదీశా! ధన్యతం జెందితిన్.

**తా** : దేవా! నీ పూజయందు సారూప్యమును, నీనామసంకీర్తనమందు సామీప్యము,

నీభక్తులతోఁగూడి కథాకాలక్షేపములు చేయుపట్ల సాలోక్యము, చరాచరాత్మకమైన నీ మూర్తి ధ్యానమందు సాయుజ్యమును గూడ నా కీలోకమందే దయచేయు చుంటివి గాన ధన్యుఁడనైతిని.

**శ్లో॥ త్వత్పాదాంబుజమర్చయామి, పరమం త్వాం చింతయామ్యన్వహం**
**త్వామీశం శరణం వ్రజామి, వచసా త్వామేవ యాచే విభో! ।**
**వీక్షాం మే దిశ చాక్షుషీం సకరుణాం దివ్యైశ్చిరం ప్రార్థితాం**
**శంభో! లోకగురో! మదీయమనసస్సౌఖ్యోపదేశం కురు ॥ 29**

**టీక :** హే విభో! = ఓ సర్వవ్యాపకుఁడా! పరమమ్ = సర్వోత్కృష్టమైన, త్వత్పాదాంబుజమ్ = నీపాదపద్మమును, అర్చయామి = పూజించుచున్నాను, అన్వహమ్ = ప్రతిదినమును, త్వామ్ = నిన్ను, చింతయామి = తలఁచుచున్నాను, ఈశమ్ = జగత్కర్తవగు, త్వామ్ = నిన్ను, శరణమ్ = జననమరణములనుండి రక్షించు దిక్కుగా, వ్రజామి = పొందుచున్నాను, వచసా = వాక్కుచేత, త్వామేవ = నిన్నే, యాచే = (అభీష్టమును) యాచించుచున్నాను. దివ్యైః = దేవతలచేతను, చిరమ్ = చాలకాలముగా, ప్రార్థితామ్ = ప్రార్థింపఁబడినదియు, సకరుణామ్ = ప్రేమతోఁగూడినదియు, చాక్షుషీమ్ = నేత్రముల సంబంధమైన, వీక్షామ్ = కటాక్షప్రసారమును, మే = నాకు, దిశ = ఇమ్ము, శంభో! = సుఖకరుఁడా!, లోకగురో! = భక్తలోకమునకు రహస్యార్థములను దెలియఁజేయువాఁడా!, మదీయమనసః = నా మనస్సునకు, సౌఖ్యోపదేశమ్ = బ్రహ్మోపదేశమును, కురు = చేయుమా.

**శా. నీపాదాబ్జము లర్చసేతుఁ, బరమున్ నిన్నే చిరంబెంచెదన్**
**నీప్రాపే గణియింతు, వాక్కునను నిన్నే చేరి యాచించెదన్**
**నాపైఁజూపి, కృపాకటాక్షమమృతాంధః ప్రార్థితంబింత సౌ**
**ఖ్యోపాధ్యాయుఁడవై భరింపు నను శంభూ! లోకరక్షాగురూ.**

**తా :** పార్వతీమనోవల్లభా! నీపాదార్చనము చేయుచుఁ బ్రతిదినము నిన్ను దలంచుచు శరణుబొంది వేఁడుకొనియెద. దయచేసి నిఖిలదేవతాప్రార్థనీయమైన నీ కరుణాకటాక్షమును నాయందురానిచ్చి జననమరణక్లేశంబులఁ దొలఁగించుచు బ్రహ్మోపదేశ మొనర్చుము.

**శ్లో॥ వస్త్రోద్ధూతవిధౌ సహస్రకరతా పుష్పార్చనే విష్ణుతా**
**గంధే గంధవహాత్మతాఽన్నపచనే బర్హిర్ముఖాధ్యక్షతా ।**
**పాత్రే కాంచనగర్భతాస్తి మయి చేద్బాలేందుచూడామణే!**
**శుశ్రూషాం కరవాణి తే పశుపతే! స్వామిన్! త్రిలోకీగురో! ॥ 30**

**టీక :** హే బాలేందుచూడామణే! = ఓ చంద్రశేఖరుఁడా!, హే పశుపతే! = సంసార బంధమోచకుఁడా!, హే స్వామిన్! = ఓ సర్వశరీరాధ్యక్షా!, త్రిలోకీగురో! = మూఁడు

లోకములకును రహస్యార్థములను ప్రకటించువాఁడా!, తే = నీయొక్క, వస్త్రోద్ధూతవిధౌ = వస్త్రోపచారము చేయుటయందు, సహస్రకరతా = సూర్యుఁడగుటయు, (వేయి కరములు గలుగుట), పుష్పార్చనే = పుష్పోపహారార్పణమందు, విష్ణుతా = విష్ణువగుటయు (వ్యాపకత్వము), గంధే = గంధోపచారమందు, గంధవహాత్మతా = వాయురూపుఁడగుటయు, అన్నపచనే = అన్నము వండుటయందు (హవిరుపచారము చేయుటయందు), బర్హిర్ముఖా-ధ్యక్షతా = ఇంద్రుఁడగుటయు (అగ్నిముఖుల కధ్యక్షుఁడగుట), పాత్రే = పాత్రోపచారమందు (అర్ఘ్యవిధి), కాంచనగర్భతా = హిరణ్యగర్భుఁడగుటయు (ధనపూర్ణుఁడగుట), మయి = నాయందు, అస్తి చేత్ = ఉన్నయెడల, తే = నీయొక్క, శుశ్రూషామ్ = సేవను, కరవాణి = చేయఁజాలుదును.

**ఉ. అంబరమిచ్చునప్పుడు సహస్రకరత్వము, విష్ణుతాప్తి పు**
**ష్పంబిడ, గంధకల్పనకుఁ బావనగంధవహత్వమున్ సుప**
**కంబిడ హవ్యభుక్పతితఁ గాంచనగర్భత పాత్రదానమం**
**దుం బొసఁగించితే సలుపుదున్ శశిలాంఛన నీకు దాస్యమున్.**

**తా :** సర్వవ్యాపకా! నీకు వస్త్రోపచారము చేయుటకు వేయిచేతులవాఁడు గావలయు. నీకు పుష్పోపచారము జేయుటకు వ్యాపకుండు గావలయు. నీకు గంధోపచారము చేయుటకు గంధవహుండు గావలయు. వంటచేసి నీకు హవిస్సు నివేదన జేయుట కగ్ని ముఖాధ్యక్షుండు గావలయు. నీకర్ఘ్యపాత్రము సమర్పించుట కాగర్భ శ్రీమంతుఁడు గావలయు. అట్టి సూర్యుండును, విష్ణువును, వాయుదేవుఁడును, దేవేంద్రుఁడును, హిరణ్యగర్భుండును నైననే కాక నీ కుపచారముచేయ నా తరమా?

**శ్లో॥ నాలం వా పరమోపకారకమిదం త్వేకం పశూనాం పతే!**
**పశ్యన్ కుక్షిగతాన్ చరాచరగణాన్ బాహ్యస్థితాన్ రక్షితుమ్ ।**
**సర్వామర్త్యపలాయనౌషధమతిజ్వాలాకరం భీకరం**
**నిక్షిప్తం గరళం గళే న గిళితం నోద్గీర్ణమేవ త్వయా ॥ 31**

**టీక :** హే పశూనాం పతే! = ఓ భూతనాథా!, కుక్షిగతాన్ = కడుపులోనున్న, చరాచరగణాన్ = స్థావరజంగమసమూహములను, బాహ్యస్థితాన్ = వెలుపలనున్నవారలను, రక్షితుమ్ = కాపాడుటకు, పశ్యన్ = ఆలోచించుచు, త్వయా = నీచేత, అతిజ్వాలాకరమ్ = మిక్కిలి తాపము గలుగఁ జేయునదియు, భీకరమ్ = భయంకరమును నగు, గరళమ్ = కాలకూటవిషము, స.. ధం : సర్వామర్త్య = సమస్తదేవతలయొక్కయు, పలాయన = పాఱిపోవుట యనియెడు రోగమునకు, ఔషధమ్ = మందగునట్లుగా, గళే = కంఠమందు, నిక్షిప్తమ్ = నిలుపఁబడినదై, న గిళితమ్ = మ్రింగబడలేదు, న+ఉద్గీర్ణమేవ = వెడల

నుమియఁబడనులేదు, పరమోపకారకమ్ = మిక్కిలి యుపకారమైన, ఇదం ఏకమ్ = ఇదియొక్కటియే, నాలం వా = (నీ మహిమ దెలియుటకు) చాలదా.

**మ.** **నిలువంజాలక మర్త్యులెల్లరు భయోన్నిద్రాళులై పాఱఁ బ్రో**
**జ్జ్వలనాభీల హలాహలం బొడిసి, ముప్పంబంచు స్వీయోదర**
**స్థలబాహ్యస్థ చరాచరాళికి మహేశా! మ్రింగకే క్రాచకే**
**గళమందుంచితివీమహోపకృతి లోకశ్రేణికిన్ జాలదే?**

**తా** : నిఖిల లోకభయంకరమై సంతాపకరమైన కాలకూటమునకు భయఁపడి పాఱిపోవు దేవతల నూఱడించుటకుఁగా నీకంఠమందె యుంచుకొని ఉమియక మ్రింగక కడుపులోని వారలకును వెలుపలి వారలకును బాధగలుగకుండ మహోపకార మొనర్చితివి. దేవా! నీమహిమ యెఱుంగుట కీ దృష్టాంత మొక్కఁటి చాలదా!

**శ్లో॥** **జ్వాలోగ్రస్సకలామరాతిభయదః క్ష్వేళః కథం వా త్వయా**
**దృష్టః, కిం చ కరే ధృతః కరతలే కిం పక్వజంబూఫలమ్? ।**
**జిహ్వాయాం నిహితశ్చ సిద్ధఘుటికా వా కంఠదేశే భృతః**
**కిం తే నీలమణిర్విభూషణమయం శంభో! మహాత్మన్! వద ॥ 32**

**టీక :** హే మహాత్మన్! = సర్వజ్ఞుఁడవైన యీశ్వరుఁడా!, జ్వాలోగ్రః = మంటలచేత సహింపఁ గూడనిదియు, స...దః : సకలామర = అందఱు దేవతలకు, అతిభయదః = మిగుల భయంకరమునునగు, క్ష్వేళః = విషము, త్వయా = నీచేత, కథం వా = ఎట్లుగా, దృష్టః = చూడబడినది?, కిం చ = అంతియకాక, కరే = హస్తమందు, ధృతః = ధరించఁబడినది? (చేతితోఁ దాఁకఁబడినది?), కరతలే = అరచేతియందు, నిహితః = ఉంచుకొనఁబడినది?, పక్వజంబూఫలం కిం? = పండిన నేరేడుపండా యేమి?, జిహ్వాయాం చ = నాలుక యందును, నిహితః = వేసికొనఁబడినది, సిద్ధఘుటికా వా = సకల సిద్ధికారియగు నౌషధ ఘుటికయా యేమి?, కంఠదేశే = కంఠ ప్రదేశమందు, భృతః = భరింపఁబడినది. అయమ్ = ఈ కాలకూటవిషము, తే = నీకు, విభూషణమ్ = అలంకారమైన, నీలమణిః కిమ్ = ఇంద్రనీలమాణిక్యమా యేమి?, వద = చెప్పుము.

**శా.** **జ్వాలాభీల హలాహలంబు, దివిషజ్జాలాతి సంత్రాసమున్**
**గ్రోలన్ గేలధరించినప్పు డది నీకున్ బక్వజంబూఫలం**
**బై లీలాగతి నాల్కపైనిడ మహాత్మా! సిద్ధగోలంబునై**
**నీలంపున్నగయయ్యెనే గళమునన్ నిల్పన్ భవానీపతీ!**

**తా** : తీవ్రజ్వాలలు గ్రమ్ముచు సకల దేవతలకును భయంకరమైన యీ కాలకూటవిషమును

కన్నులతో గాంచుటయేకాక చేతితో యెత్తి అఱచేతిలో నుంచుకొంటి వది నేరేడు పండా ఏమి? ఇదిగాక నాలుకమీఁద వేసికొన్నావు. సిద్ధఘుటికయా ఏమి? మఱియును కంఠమం దటులనే యుంచుకొంటి విది యింద్రనీలమాణిక్యమా ఏమి? చెప్పుము.

**శ్లో॥ నాలం వా సకృదేవ దేవ! భవతస్సేవా నతిర్వా నుతిః**
**పూజా వా స్మరణం కథాశ్రవణమప్యాలోకనం మాదృశామ్ ।**
**స్వామిన్నస్థిరదేవతానుసరణాయాసేన కిం లభ్యతే**
**కా వా ముక్తిరితః కుతో భవతిచేత్కిం ప్రార్థనీయం తదా ॥ 33**

**టీక :** హే స్వామిన్! = సర్వభూతాధ్యక్షుఁడ వైన దేవా!, భవతః = నీయొక్క, నతిర్వా =కాయకమైన నమస్కారమేని, నుతిర్వా = వాక్కుతోడి స్తోత్రమేని, పూజా వా = పూజయేని, స్మరణమ్ = మనసులో స్మరించుటయేని, కథాశ్రవణమపి = చెవులతో నీ చరిత్రలు వినుటయేని, ఆలోకనమ్ = కన్నులతో నీమూర్తిఁ జూచుటయేని, సకృదేవ = ఒక్కమాఱుమాత్రమే, భవతః = నీయొక్క, సేవా = భజనము, మాదృశామ్ = నావంటి వారలకు, నాలం వా = (ముక్తియొసఁగ) చాలదా?, ఇతః = ఈపై యుపాయమును విడిచి, ముక్తిః = మోక్షము, కా వా = ఎట్టిది?, కుతోఽపి = పై యుపాయములలోనే యొకదానినుండియైనను, భవతి చేత్ = ముక్తిగలుగునేని, తదా = అప్పుడు, అ...న : అస్థిర = శాశ్వతముగాని, దేవతా = దేవతలయొక్క, అనుసరణయాసేన = ఆశ్రయించు ప్రయత్నముచేత, కిం లభ్యతే = ఏమి లాభమగును, ప్రార్థనీయమ్ = కోరఁదగినదియు, కిమ్ = ఏమున్నది?

**మ. దేవా! యస్థిరదేవతానుసరణాతిక్లేశమేలా? భవ**
**త్సేవాలంబనమో, నమస్కృతియొ, భక్తిస్తోత్రమో, పూజయో,**
**భావధ్యానమొ, నీకథాశ్రవణమో భవ్యాత్మ నీదర్శనం**
**బో వేఁటేటికిఁజాలు ముక్తియన మాకొండేది ప్రార్థింపఁగన్?**

**తా :** ఓ స్వామీ! మహాదేవా! కాయిక వాచిక మానసికంబులగు నమస్కారము, స్తోత్రము, స్మరణము మున్నగు నీ సేవలయం దొక్కొక్కటియు మోక్షమునకు సంపూర్ణ సాధన మగును. ఈ యుపాయములను వీడి వేఱ మోక్షము లేదు. అస్థిరులయిన యితర దేవతల ననుసరించి యేమి లాభము? వారిని కోరఁదగిన దేమున్నది?

**శ్లో॥ కిం బ్రూమస్తవసాహసం పశుపతే! కస్యాస్తి శంభో! భవ-**
**ద్ధైర్యం చేదృశమాత్మనస్స్థితిరియం చాన్యైః కథం లభ్యతే ।**
**భ్రశ్యద్దేవగణం త్రసన్మునిగణం నశ్యత్ప్రపంచం లయం**
**పశ్యన్ నిర్భయ ఏక ఏవ విహరత్యానందసాంద్రో భవాన్ ॥ 34**

**టీక :** హే పశుపతే! = ఓ భూతనాథా!, హే శంభో! = ఓ శంకరా!, తవ = నీయొక్క, సాహసమ్ = తెగింపు (అసాధ్య సాధనము), కిం బ్రూమః = ఏమని చెప్పుదును, ఈదృశమ్ = ఇటువంటి, భవద్ధైర్యమ్ = నీ ధైర్యము, కస్య = ఎవ్వనికి, అస్తి = కలదు?, ఇయమ్ = ఈ, (ఇట్టి), ఆత్మనః = తన (నీ) యొక్క స్థితిశ్చ = ఉనికియు, అన్యైః = ఇతరులచేత, కథమ్ = ఎట్లుగా, లభ్యతే = పొందఁబడును, ఆనందసాంద్రః = ఆనందముతో నిండియున్న, భవాన్ = నీవు, భ్రశ్యద్దేవగణమ్ = పడిపోవు దేవగణంబును, త్రసన్మునిగణమ్ = భయపడుచున్న మునిగణంబును, నశ్యత్ప్రపంచమ్ = మాయమై పోవుచున్న ప్రపంచమునుం గలదియగు, లయమ్ = ప్రళయకాలమును, పశ్యన్ = చూచుచు, నిర్భయః = భయములేనివాఁడవై, ఏక ఏవ = ఒక్కఁడవే, విహరతి = విహరించుచున్నావు.

> **మ.** **పదవిభ్రష్టసుపర్వకంబు, భయతప్యన్మౌనిసంఘుంబు న**
> **స్యదజాండంబు లయంబుగాంచుచును సాంద్రానందరూపుండవై**
> **ఎద నేమేని భయంబు లేకొకఁడ వీవే లీలఁగ్రీడింతు మే**
> **లదిరా! సాహస మీనిజస్థితి మహాత్మా! యేరికేనుండునే?**

**తా :** ఓ పశుపతీ! ఏమి నీ సాహసము? ఏమి నీ ధైర్యము? మఱియెవ్వరేని యిట్లు నిలిచియుండఁ గలుగుదురా? నాశోన్ముఖులై దేవతలందఱు నిటునటు పాఱజూచుచుండ మునులందఱు గడగడలాడుచు భయకంపితులగుచుండ తుదకు దృశ్య ప్రపంచమంతయు నశించి పోవుచుండ నీవొక్కఁడవే గదా నిర్భయుఁడవై పరమానందపరిపూర్ణుఁడవై మహాప్రళయమం దోటులేక విలసిల్లుచుంటివి!

> **శ్లో॥ యోగక్షేమధురంధరస్య సకలశ్రేయః ప్రదోద్యోగినో**
> **దృష్టాదృష్టమతోపదేశకృతినో బాహ్యాంతరవ్యాపినః ।**
> **సర్వజ్ఞస్య దయాకరస్య భవతః కిం వేదితవ్యం మయా**
> **శంభో! త్వం పరమాంతరంగ ఇతి మే చిత్తే స్మరామ్యన్వహమ్ ॥ 35**

**టీక :** యో..స్య : యోగ = అలభ్యవస్తువులను లభింపఁ జేయుటయందును, క్షేమ = లబ్ధమైనదానిని పరిపాలించుటయందును, ధురంధరస్య = భారమును వహించినట్టియు, సకలశ్రేయః ప్రదోద్యోగినః = సమస్త శుభంబులనిచ్చెడు నట్టి యుద్యోగము గలిగినట్టియు, దృ...నః : దృష్టాదృష్ట = ఐహికాముష్మికములకు, మత = సమ్మతమైన యుపాయమును, ఉపదేశకృతినః = ఉపదేశించు నేర్పుగలిగినట్టియు, బాహ్యాంతరవ్యాపినః = బాహ్య ప్రపంచమందును నిండియున్నట్టియు, సర్వజ్ఞస్య = సర్వజ్ఞుఁడవైనట్టియు, దయాకరస్య = దయఁజూపునట్టియు, భవతః = నీయొక్క (సంబంధమైనది), మయా = నాచేతను, వేదితవ్యమ్ = తెలియఁదగినదియు, కిమ్ = ఏమున్నది?, త్వమ్ = నీవు, మే = నాకు,

పరమాంతరంగః = అత్యంతాప్తుఁడవు, ఇతి = అని, అన్వహమ్ = ప్రతిదినమును, చిత్తే = మనస్సునందు, స్మరామి = తలఁచుచున్నాను.

**శా. యోగక్షేమభరంబుదాల్చి, శుభదోద్యోగంబునందుండి, స**
**త్త్వాగమ్యంబు మతంబుదెల్పుట కుపాధ్యాయుండవై సర్వవి**
**ద్ప్రాగల్భ్యంబున నంతటన్ వెలుఁగుచున్ దాక్షిణ్యముఁజూపు ని**
**న్నేఁ గోరందగు నేది యాప్తునిగ ధ్యానింతున్ సదా శంకరా!.**

**తా** : ప్రజల యోగక్షేమభారము వహించుట, సకల శ్రేయస్సుల నొసఁగుచుండుట, ఐహికాముష్మికసాధనంబులైన యుపాయముల నుపదేశించుట, ఎక్కడఁజూచినను తానయై నిండియుండుట, సర్వజ్ఞత్వము, ఎల్లరును దయతోఁ జూచుట, ఇవి యన్నియు నీ గుణములు గదా! పరమేశ్వరా! మహాదేవా! మహానుభావా! ఇంక నేనేమి తెలిసికొనవలయును? నీవే నాకు పరమాప్తుఁడ వని యెల్ల వేళలను దలంతును. అదియే నాకు శ్రేయస్కరమగుఁగాక.

**శ్లో॥ భక్తో భక్తిగుణావృతే ముదమృతాపూర్ణే ప్రసన్నే మనః-**
**కుంభే సాంబ! తవాంఘ్రిపల్లవయుగం సంస్థాప్య సంవిత్ఫలమ్ ।**
**సత్త్వం మంత్రముదీరయన్ నిజశరీరాగారశుద్ధిం వహన్**
**పుణ్యాహం ప్రకటీకరోమి రుచిరం కల్యాణమాపాదయన్ ॥ 36**

**టీక :** హే సాంబ! = ఓ సాంబమూర్తి! భక్తః = భక్తుఁడనైన నేను, నిజశరీర = స్వకీయశరీరమనునట్టి, అగారశుద్ధిమ్ = గృహముయొక్క పరిశుద్ధిని (దోషములు లేమి), వహన్ = సంపాదించుచున్న వాఁడనై, రుచిరమ్ = మనస్సునకింపైన, కల్యాణమ్ = మంగళమనియెడు వివాహమంగళమును, ఆపాదయన్ = సంపాదింపఁ బోవుచు, భక్తిగుణావృతే = భక్తియను నూలుపోఁగులతోఁ జుట్టఁబడినదియు, ముదమృతాపూర్ణే = సంతోషమనునట్టి యుదకములతో నిండించఁబడినదియు, ప్రసన్నే = స్వచ్ఛమైనదియు నగు, మనః కుంభే = మనస్సను కలశమందు, తవ = నీయొక్క, అంఘ్రిపల్లవయుగమ్ = పాదంబులను రెండు పల్లవములను, సంవిత్ఫలమ్ = జ్ఞానంబను కొబ్బరిబొండంబును, సంస్థాప్య = ఉనిచి, సత్త్వమ్ = సత్త్వగుణ ప్రధానమైన, మంత్రమ్ = తారకమంత్రమును, ఉదీరయన్ = ఉచ్చరించుచు, పుణ్యాహమ్ = పుణ్యాహవాచనమును, ప్రకటీకరోమి = ప్రకాశింపఁజేయుదురు.

**మ. అమితానందసుధాప్రపూర్ణము, సముద్యద్భక్తి పాశావృతం**
**బు, మనఃకుంభమునన్ భవత్పదయుగంపుం గెంజిగుళ్ళుంచి ది**
**వ్యమనీషాఫలముం గదించి, హితకల్యాణాప్తికై దేహగే**
**హము సంశుద్ధికి సత్వమంత్రమునఁ బుణ్యాహంబు గావించెదన్.**

**తా** : ఓ సాంబమూర్తీ! నేను భక్తుండనై నాశరీరం బనుగృహంబును నిర్దుష్టముగా శుద్ధ పఱచికొని మనఃప్రియంబగు కల్యాణంబును గావింపఁబూనియందులకుగా భక్తియను నూలుపోఁగులు చుట్టి సంతోషమను జలంబుతో నించిన నామనస్సను కలశంబున నీపాదపల్లవములను, నీజ్ఞానంబను నారికేళ ఫలంబును జేర్చి కలశస్థాపనము చేసి తారకమంత్రోచ్చారణపూర్వకముగాఁ బుణ్యాహవాచనము నెఱవేర్తును. ఎల్లవేళలను మనస్ఫూర్తిగా మీపాదపద్మములను స్మరించెద నని తాత్పర్యము.

**శ్లో॥ ఆమ్నాయాంబుధిమాదరేణ సుమనస్సంఘాస్సముద్యన్మనో**
**మంథానం దృఢభక్తిరజ్జుసహితం కృత్వా మథిత్వా తతః ।**
**సోమం కల్పతరుం సుపర్వసురభిం చింతామణిం ధీమతాం**
**నిత్యానందసుధాం నిరంతరరమాసౌభాగ్యమాతన్వతే ॥ 37**

**టీక :** సుమనస్సంఘాః = పండితబృందములు (దేవబృందములు), సముద్యత్ = గుణసముదాయముతో నొప్పుచున్న, మనః = మనస్సును, దృఢభక్తి రజ్జుసహితమ్ = అచంచలభక్తియను త్రాటితోఁగూడిన, మంథానమ్ = కవ్వముగా, కృత్వా = చేసి, ఆమ్నాయాంబుధిమ్ = వేదసముద్రమును, ఆదరేణ = ఆసక్తితో, మథిత్వా = తరిచి, తతః = దానివలన, సోమమ్ = చంద్రుని, కల్పతరుమ్ = కల్పవృక్షమును, సుపర్వసురభిమ్ = కామధేనువును, చింతామణిమ్ = చింతామణిని, ధీమతామ్ = బుద్ధికి సమ్మతమైన, నిత్యా–నందసుధామ్ = అమృతమువంటి నిత్యానందస్వరూపుఁడును, నిరంతర రమాసౌభాగ్యమ్ = మోక్షలక్ష్మీసమృద్ధిరూపుఁడును నగు, సోమమ్ = ఉమాసమేతుఁడగు పరమేశ్వరుని, ఆతన్వతే = విస్తరించి పొందుచున్నారు.

**మ. తలఁపుంగవ్వము భక్తి రజ్జువులచేతన్ గట్టి యామ్నాయపుం**
**జలధిన్ బ్రేమమెయిన్ మథించి, సుమనస్సంఘంబు తాఁగైకొనున్**
**దలఁపుంజెట్టు, సుపర్వధేనువును, జింతారత్నమున్, సోము న**
**స్ఖలితానందసుధన్ నిరంతర రమా సౌభాగ్య సాయుజ్యమున్.**

**తా** : దేవతలందఱును మందరగిరిని కవ్వముగాఁ జేసి సముద్రము మథించి కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, అమృతము, చంద్రుఁడు వీనిని సంపాదించినట్లు విద్వాంసు లందఱు తమ మనస్సును కవ్వముగాఁ జేసి భక్తియను త్రాడుగట్టి వేదంబులనియెడు మహా సముద్రమును తరిచి యందుండి భక్తిశాలురకు కల్పవృక్ష చింతామణి కామధేనువుల వంటి వాఁడును నిత్యానందస్వరూపుఁడును మోక్షలక్ష్మీస్వరూపుఁడును నగు సోమేశ్వరుని సాధించుచున్నారు.

శ్లో॥ ప్రాక్పుణ్యాచలమార్గదర్శితసుధామూర్తిః ప్రసన్నశ్శివ–
సోమస్సద్గణసేవితో మృగధరః పూర్ణస్తమోమోచకః ।
చేతఃపుష్కరలక్షితో భవతిచేదానందపాథోనిధిః
ప్రాగల్భ్యేన విజృంభతే, సుమనసాం వృత్తిస్తదా జాయతే ॥ **38**

**టీక :** ప్రా...ర్తి : ప్రాక్పుణ్యాచల = పూర్వజన్మమందలి పుణ్యములగుట్టయొక్క, తూర్పుదిక్కున నుండు పుణ్యకరమైన పర్వతము (ఉదయగిరి) యొక్క, మార్గ = మార్గమున, దర్శిత = చూపఁబడిన, సుధామూర్తిః = అమృతశరీరము (అమృతమయమగుబింబము) కలవాఁడు, ప్రసన్నః = స్వచ్ఛమైనవాఁడును, శివః = ఆనందస్వరూపుఁడు (ఆహ్లాదకరమైనవాఁడు), సద్గణసేవితః = సజ్జనపుంజముచేఁ బూజింపబడినవాఁడు (నక్షత్రగణముచేఁ జుట్టుకొనఁబడినవాఁడు), మృగధరః = లేడిని దాల్చినవాఁడు, పూర్ణః = అంతటను నిండినవాఁడు, (షోడశకలాపరిపూర్ణుఁడు), తమోమోచకః = అజ్ఞానము (చీకఁటి) బాపువాఁడు, సోమః = ఈశ్వరుం డనుచంద్రుఁడు, ప్రాగల్భ్యేన = ప్రౌఢిమచేత, చేతఃపుష్కరలక్షితః = హృదయాకాశమందు చూడఁబడినవాఁడు, భవతిచేత్ = అగునేని, ఆనందపాథోనిధిః = ఆనందసముద్రము, విజృంభతే = ఉప్పొంగుచున్నది, తదా = అప్పుడు, సుమనసామ్ = సంస్కరింపఁబడిన చిత్తము గలవారలకు, వృత్తిః = (అందోలలాడ వలయుననను) ప్రవృత్తి, జాయతే = కలుగుచున్నది.

మ. పరిపూర్ణుండు, సుధామయుండు, శివుఁడున్ బ్రాక్పుణ్యశైలాధ్వ వి
స్ఫురణుం, డేణధరుండు, సోముఁడు, తమంపుంబోక, సత్సేవితుం
డరయన్ మానసపుష్కరంబునకు రానానందపాథోధి బి
ట్టు రహించున్ సుమనఃప్రవృత్తియును బుట్టున్ బోధనాశక్తిమై.

**తా :** పురుషుఁడు పూర్వజన్మమందు సంపాదించుకొనిన యుదయపర్వత ప్రాయంబగు పుణ్యము మీఁదుగాఁ దనయమృతశరీరంబు భక్తలోకంబులకుఁ గనుపఱచి ప్రసన్నుఁడు ఆనందమయుండు నయి నక్షత్రపుంజంబట్లు సాధుబృందంబులు చుట్టుకొని సేవింప మృగధరుండును పరిపూర్ణుఁడును తమోనివారకుండు నగుచు చంద్రుఁడుంబోలె హృదయాకాశమందు సోమేశ్వరుండు పరమప్రబోధముతో వెలుగొందెనేని ఆనందసముద్రముప్పొంగును. అప్పుడు శుద్ధతరంగులగు విబుధులచిత్తము రంజిల్లును.

శ్లో॥ ధర్మో మే చతురంఘ్రికస్సుచరితః పాపం వినాశం గతం
కామక్రోధమదాదయో విగళితాః కాలాస్సుఖావిష్కృతః
జ్ఞానానందమహౌషధిస్సుఫలితా కైవల్యనాథే సదా
మాన్యే మానసపుండరీకనగరే రాజావతంసే స్థితే ॥ **39**

**టీక :** రాజావతంసే = చంద్రుఁడు శిరోభూషణముగాఁ గలవాఁడును (రాజశ్రేష్ఠుడును), మాన్యే = సర్వపూజ్యుఁడును (సర్వసమ్మతుఁడును) నగు శివుఁడు (రాజు), మే = నాయొక్క, మానసపుండరీకనగరే = కమలమువంటి మనస్సనియెడు నగరమందు, కైవల్యనాథే = కైవల్యముతోఁగూడిన ప్రభువై, స్థితే = ఉండఁగా, చతురంఘ్రికః = నాలుగు పాదములు గలిగిన, ధర్మః = ధర్మము, సుచరితః = సుఖముగా నాచరింపఁబడినది. పాపమ్ = పాపము, వినాశమ్ = నాశమును, గతమ్ = పొందినది, కామక్రోధమదాదయః = కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము ననునవి, విగళితాః = తొలఁగిపోయినవి, కాలాః = పక్షము మాసము సంవత్సరము మొదలగు కాలములు, సుఖావిష్కృతః = సుఖమును ప్రకటించుచున్నవి. జ్ఞా...ధిః : జ్ఞానానంద = జ్ఞానసాధన గ్రంథబాహుళ్య మనియెడు, మహౌషధిః = సిద్ధిసాధనమయిన యోషధి, సదా = ఎల్లవేళలను, సుఫలితా = చక్కఁగా ఫలించినది. భవతి = అగుచున్నది.

**మ.** **శ్రీమన్మానసపుండరీకనగరీ సింహాసనంబున్ ద్రిలో**
**కీమాన్యుండగు రాజమౌళి యెపుడెక్కెన్‌బాప మప్డే చనెన్**
**గామాదుల్ నశియించె, ధర్మమును నల్గాళ్ళంబ్రవర్తించె, వి**
**ద్యామూల్యంబులు గ్రంథముల్ ప్రబలె సౌఖ్యంబిచ్చెఁగాలస్థితుల్.**

**తా** : ధార్మికుఁ డైన రాజు స్వతంత్రాధీశ్వరుఁడై నగరియందుండి పరిపాలించు చుండగా దోషములన్నియుఁ దొలఁగిపోయి భూమి ఫలవంతమై సర్వసమృద్ధి గలిగినట్లు నా హృదయపుండరీకమందు పరమేశ్వరుఁడు మోక్షాధినాథుఁడై నివశించియుండ నాకు కామక్రోధాద్యంతశ్శత్రువర్గము పాపములుం దొలఁగిపోయి జ్ఞానధనంబు లనియెడు నోషధులు ఫలించి యెల్లవేళలను సుఖంబు సమకూఱినది.

**శ్లో॥ ధీయంత్రేణ వచో ఘటేన కవితాకుల్యోపకుల్యాక్రమై-**
**రానీతైశ్చ సదాశివస్య చరితాంభోరాశిదివ్యామృతైః ।**
**హృత్కేదారయుతాశ్చ భక్తికలమాస్సాఫల్యమాతన్వతే**
**దుర్భిక్షాన్మమ సేవకస్య భగవన్విశ్వేశ! భీతిః కుతః ॥ 40**

**టీక :** హే భగవన్! = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవైన, హే విశ్వేశ! = ఓ సకలభువనాధిపతీ!, ధీయంత్రేణ = బుద్ధియనుమోటతో, వచోఘటేన = వాక్కను బొక్కెనచేత, కవితాకుల్యోప కుల్యాక్రమైః = కవిత్వమనియెడు కాలువలు పిల్లకాలువలు మొదలగు వానిగుండా, ఆనీతైః = (హృదయమను పొలములోనికి) తేఁబడిన, సదాశివస్య = పరమశివునియొక్క, చ... తైః : చరితాంభోరాశి = చరిత్రలనియెఁడు సముద్రముయొక్క, దివ్యామృతైః = మంచినీళ్ళ

చేతను, హృత్కేదారయుతాః = హృదయం బను పొలమునఁ బుట్టియున్న, భక్తికలమాః = భక్తియను వరిపైరులు, సాఫల్యమ్ = పంటను, ఆతన్వతే = విస్తరించుచున్నవి. సేవకస్య = నీ సేవకుఁడనగు, మమ = నాకు, దుర్భిక్షాత్ = కఱవువలన, భీతిః = భయము, కుతః = ఎక్కడిది?

**మ. పలుకుంబానఘటించి యీశ్వరకథా పాథోధిదివ్యామృతం**
**బలవిజ్ఞానపుటేతమెత్తి కవితోద్యత్సారణీ ధోరణిన్**
**దలఁపుం జేనికిఁదోలి బత్తి వరిపంటన్ జాలఁబండింప న**
**వ్వల నీదాసునకేటి కాటకపుటుత్పాతంబు విశ్వేశ్వరా!.**

**తా** : హే భగవన్! విశ్వేశ్వరా! నీచరిత్రం బను మహాసముద్రములోని దివ్యామృతము కవిత్వం బనుకాలువలు పిల్లకాలువలు మొదలగువానిగుండ వాక్కను కుండతో నా బుద్ధి యను మోటవలన హృదయమను పొలములోనికి ప్రవహించి భక్తి యను సస్యమును ఫలవంతముఁగా జేయుచున్నది. ఇఁక నెంత కఱవు వచ్చినను నాకేమి భయము. మీ చరిత్రలు తలఁచుచు భక్తితో మిమ్మెప్పుడు సేవించు చుందునని భావము.

**శ్లో॥ పాపోత్పాతవిమోచనాయ రుచిరైశ్వర్యాయ మృత్యుంజయ!**
**స్తోత్రధ్యాననతిప్రదక్షిణసపర్యాలోకనాకర్ణనే ।**
**జిహ్వాచిత్తశిరోంఘ్రిహస్తనయనశ్రోత్రైరహం ప్రార్థితో**
**మామాజ్ఞాపయ తన్నిరూపయ ముహుర్మామేవ మామేఽవచః ॥ 41**

**టీక :** హే మృత్యుంజయ! = మృత్యువును జయించిన వాఁడా!, పాపోత్పాతవిమోచనాయ = పాపంబను నుత్పాతమును బాపుటకొఱకును, రుచిరైశ్వర్యాయ = ఇష్టమైన యైశ్వర్యము కొఱకును, స్తో...నే : స్తోత్ర = (నిన్ను) స్తోత్రముచేయుట, ధ్యాన = (నిన్ను) ధ్యానించుట, నతి = (నీకు) నమస్కారము చేయుట, ప్రదక్షిణ = (నీ) ప్రదక్షిణము చేయుట, సపర్యా = (నీ) పూజసేయుట, ఆలోకన = (నిన్ను) చూచుట, ఆకర్ణనే = (నీకథలు) వినుట – వీని విషయమై, జి..త్రైః : జిహ్వా = నాలుకచేతను, చిత్త = మనస్సుచేతను, శిరః = శిరస్సుచేతను, అంఘ్రి = పాదములచేతను, హస్త = చేతుల చేతను, నయన = కన్నులచేతను, శ్రోత్రైః = చెవులచేతను, అహమ్ = నేను, ప్రార్థితః = ప్రార్థింపఁబడితిని. మామ్ = నన్ను, ఆజ్ఞాపయ = ఆజ్ఞాపింపుము (అట్లు చేయుమని సెలవిమ్ము), తత్ = ఆ స్తోత్రాదికమును గూర్చి, మామ్ = నన్ను, ముహుః = మాటిమాటికి, నిరూపయ = పురికొల్పుము. మే = నాకు, అవచః = మూఁగతనము, మేవ = కలుగనీయకుము.

శా. ధ్యానస్తోత్రనతిప్రదక్షిణసపర్యాలోకనాకర్ణన
శ్రీనొందన్ మది నాల్కయున్ దలయు నంఘ్రిద్వంద్వమున్ గేల్గనుల్

వీనుల్ నంద్వరపెట్టుచున్నవి యఘాలిన్ బాసి యైశ్వర్య సం
ధానప్రాప్తికి మూకభావమిడ కాజ్ఞాపింపు నీదాస్యమున్.

**తా** : ఓ మృత్యుంజయుఁడా! పాపములు నశించి యిష్టార్థము సిద్ధించుటకుగా పరమేశ్వరుని స్తుతింపు మని నాలుకయు, ధ్యానింపు మని మనసును, నమస్కరింపుమని శిరస్సును, ప్రదక్షిణము చేయు మని పాదములు, పూజించు మని చేతులును, చూడు మని కన్నులును, కథలు విను మని చెవులును, నన్ను గోరుచున్నవి. నీయాజ్ఞ లేనిదే ఆ కోరిక నే నెట్లు తీర్చగలుగుదును? నాకాజ్ఞయిచ్చి పలుమా అట్లు చేయుటకు న న్నలవఱుపుము. ఇందు నాకు మూఁగతనము మతిలేమి కుంటితనము గ్రుడ్డితనము మొదలగునవి రాకుండఁ జూడుము. ప్రతిబంధక మేమియు లేకుండఁ జింతితార్థ సిద్ధియొసఁగుమని తాత్పర్యము.

**శ్లో॥ గాంభీర్యం పరిఖాపదం ఘనధృతిః ప్రాకార ఉద్యద్గుణ-**
**స్తోమశ్చాప్తబలం ఘనేంద్రియచయో ద్వారాణి దేహస్థితః ।**
**విద్యా వస్తుసమృద్ధిరిత్యఖిలసామగ్రీసమేతే సదా**
**దుర్గాతిప్రియ! దేవ! మామకమనోదుర్గే నివాసం కురు ॥ 42**

**టీక :** హే దుర్గాతిప్రియ! = పర్వతదుర్గమందు మిగుల ప్రీతిగలిగిన, హే దేవ! = ఓయి పరమశివుఁడా!, పరిఖాపదమ్ = అగడ్తకు లక్షణమయిన, గాంభీర్యమ్ = గాంభీర్యము (లోఁతు)ను, ఘనధృతిః = దిట్టమైన ధైర్యము, ప్రాకారః= కోటగోడయును, ఉద్యద్గుణస్తోమః = పుట్టుచున్న సద్గుణపుంజము, ఆప్తబలమ్ = నమ్మకమైన బలమును, దేహస్థితః = శరీరమందున్న, ఘనేంద్రియచయః = కన్ను మొదలగు నింద్రియములు, ద్వారాణి = రాకపోకలకు ద్వారములును, విద్యా = ఈశ్వరుని గురించిన జ్ఞానము, వస్తు సమృద్ధిః = పదార్థ సంపత్తియును, ఇతి = ఇట్టి, అఖిలసామగ్రీ సమేతే = దుర్గమునకుఁ గావలసిన పదార్థములన్నియు సమగ్రముగానున్న, మామకమనోదుర్గే = నా మనస్సను దుర్గమందు, సదా = ఎప్పుడును, నివాసమ్ = నివాసము, కురు = చేయుము.

**శా. ఘనగాంభీర్యమగడ్త, మేటిధృతి ప్రాకారంబు, సాధూద్గుణం**
**బనుకూలంబు బలంబు, నింద్రియములే ద్వారాళి, విద్యాది వ**
**స్తునికాయంబు ధనంబు, మామక మనోదుర్గానకున్ దాన ని**
**త్యనివాసం బొనరింపవచ్చుగద దుర్గాసక్త! భక్తప్రియా!.**

**తా** : మిగుల దుర్గమంబగు కైలాసపర్వతమునఁ బ్రీతితో నివసించుచున్నయో దేవా! నా మనంబు గాంభీర్య మగడ్తగను, ధైర్యము ప్రాకారముగను, ఉదయించు సుగుణంబులు బలంబుగను, చక్షురాదీంద్రియములు ద్వారములుగను, పరమశివజ్ఞానము సర్వపదార్థ సంపత్తిగను దుర్గలక్షణ సమగ్రంబై యున్నది. దుర్గప్రియుండవుగావున నీవిందు నివసింపుము.

**శ్లో॥ మాగచ్ఛస్త్వమితస్తతో గిరిశ! భో! మయ్యేవ వాసం కురు**
**స్వామిన్నాదికిరాత! మామకమనఃకాంతారసీమాంతరే ।**
**వర్తంతే బహుశో మృగా మదజుషో మాత్సర్యమోహాదయ-**
**స్తాన్హత్వా మృగయావినోదరుచితా లాభం చ సంప్రాప్స్యసి ॥ 43**

**టీక :** హే ఆదికిరాత! = ఓ యాదికిరాతమూర్తీ!, భో గిరీశ! = ఓ కైలాసవాసా!, స్వామిన్! = మహాప్రభో!, త్వమ్ = నీవు, ఇతస్తతః = ఇటునటు, మాగచ్ఛః = పోకుము, మయ్యేవ = నాయందే, వాసమ్ = నివాసమును, కురు = చేయుము, మామక మనః కాంతార సీమాంతరే = నా హృదయంబను నరణ్య ప్రాంతమున, మదజుషః = (మమ్మెవ్వరును జయింపలేరను) గర్వముతోఁగూడిన, మాత్సర్య మోహాదయః = మాత్సర్యము మోహము మొదలగు, మృగాః = అడవిమృగములు, బహుశః = అనేకములుగా, వర్తంతే = తిరుగుచున్నవి. తాన్ = వానిని, హత్వా = చంపి, మృగయావినోదరుచితాలాభం చ = వేఁటతో కాలముగడపుటయందలి కోరికయొక్క ఫలితమును, సంప్రాప్స్యసి = పొందఁగలవు.

**మ. ఇదిగో ఆదికిరాత! యేమిటికి నీ వీడాడఁదారాడ నా**
**హృదయారణ్యమునన్ జరింపుమిట నిన్నే క్రూరసత్వంబులు**
**న్మదజుష్టంబులు హద్దులేక తిరుగున్ మాత్సర్యమోహాదులా**
**కదుపుంగూలిచి తేలుమయ్య మృగయా కౌతూహలక్రీడలన్.**

**తా :** ఓ ఆదికిరాతమూర్తీ దేవా! నీవెందును బోక నా మనమునందుండుము. నామనంబు మహారణ్యంబు. అందు కామక్రోధాదులు క్రూరమృగంబులు మెండుగా నున్నవి. వాని వేఁటాడి వేఁటయందలి నీయానందము దీర్చికొందువు.

**శ్లో॥ కరలగ్నమృగః కరీంద్రభంగో ఘనశార్దూలవిఖండనోఽస్తజంతుః ।**
**గిరిశో విశదాకృతిశ్చ చేతః కుహరే పఞ్చముఖోఽస్తి మే కుతోభీః ॥44**

**టీక :** కరలగ్నమృగః = చేతనిఱికిన మృగముగలవాఁడును, కరీంద్రభంగః = గజాసురుని భంగపఱచినవాఁడును (ఏనుఁగులజంపునదియు), ఘనశార్దూలవిఖండనః = ప్రబలుఁడైన వ్యాఘ్రాసురుని ఖండించినవాఁడును (పెద్దపులులఁజంపునదియు), అస్తజంతుః = తనయందు లీనమగు ప్రాణికోటిగలవాఁడును (జంతువులనిరసించునదియు), గిరిశః = పర్వతమందు శయనించువాఁడును, విశదాకృతిః = తెల్లని శరీరకాంతి గలవాఁడును, పంచముఖః = అయిదు ముఖములు గలవాఁడును, (తెఱువఁబడిన ముఖము గలదియు) నగు పరమేశ్వరుఁడను సింహము, మే = నాయొక్కచ, చేతఃకుహరే = చిత్తంబను గుహయందు, అస్తి = కలదు, మే = నాకు, భీః = భయము, కుతః = ఎక్కడిది.

గీ. హస్తవిన్యస్తమృగము, గజాసుభంగ
మస్తజంతువ్రజం, బురు వ్యాఘ్రహరము
తతగిరీశ పంచముఖంబు ధవళమూర్తి
హృదయ గుహనుండ నాకు నింకేటి భయము.

**తా** : సింహమునకు మృగములు చేత జిక్కుచుండును. పరమేశ్వరుఁడు మృగమును చేత నిరికించుకొనియె. అది వ్యాఘ్రముల ఖండించును. ఈయన వ్యాఘ్రాసురుని ఖండించెను. దానిఁజూచి జంతువులన్నియుఁ గనపడకుండఁబాఱిపోవును. ఆయనయందే జంతుజాల మంతయు లయించును. ఇరువురకును పర్వతమే వాసస్థలము. శరీరకాంతి తెలుపు, పంచముఖత్వ ముభయులకు నున్నది. అట్టి మహాదేవుఁడు సింహములాగున నాచిత్తకుహరమునందు నివసించి యున్నాఁడు. నాకేభీతియును లేదు.

**శ్లో॥ ఛందశ్శాఖిశిఖాన్వితైర్ద్విజవరైస్సంసేవితే శాశ్వతే**
**సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలైర్దీపితే ।**
**చేతఃపక్షిశిఖామణే! త్యజ వృథా సంచారమన్యైరలం**
**నిత్యం శంకరపాదపద్మయుగళీ నీడే విహారం కురు ॥ 45**

**టీక :** హే చేతఃపక్షిశిఖామణే! = మనస్సనియెడు పక్షిశ్రేష్ఠమా!, ఛందశ్శాఖిశిఖాన్వితైః = వేదములనియెడు వృక్షములయొక్క కొమ్మల చివరలతో (వేదాంతములతో), అన్వితైః = సంబంధించిన, ద్విజవరైః = బ్రాహ్మణశ్రేష్ఠుల (పక్షిశ్రేష్ఠముల)చేత, సంసేవితే = ఆశ్రయింపఁబడినదియు, శాశ్వతే = నిత్యమైనదియు, సౌఖ్యాపాదిని = సుఖము సంపాదించునదియు, సుధాసారైః = అమృతరసముగల, ఫలైః = ఫలములతో, ఖేద భేదిని = సంసార దుఃఖమును (ఆకలిని) పోఁగొట్టునదియు, దీపితే = ప్రకాశవంతమైన, శంకరపాదపద్మయుగళీనీడే = ఈశ్వరునియొక్క పాదపద్మద్వంద్వమను గూఁటియందు, విహారమ్ = విహారమును, కురు = చేయుము, అన్యైః = ఇతరములతో, అలమ్ = చాలును, వృథా = నిష్ఫలమైన, సంచారమ్ = సంచారమును, త్యజ = విడువుము.

శా. చందశ్శాఖిశిఖాయుత ద్విజవరస్ఫారంబు, నిత్యంబు, స్వ
చ్ఛందానందము ఖేదభేదియు, సుధాసారోరుసమ్యక్ఫలా
స్పందం, బిందుకలావతంసుని పదాబ్జద్వంద్వమన్ గూట నో
డెందంపుం ద్విజరాజ! నిల్పుమితరోడ్డీనంబు లింకేటికిన్.

**తా** : ఓ చిత్తపక్షిసత్తమా! ఇటునటు దిరిగి యేల వృథా శ్రమపడియెదవు? పరమేశ్వరుని పాదద్వంద్వము చక్కని చిలుక గూఁడు. దాని కెన్నఁడును చలనంబు లేదు. అందు చక్కని వెలుతురుగలదు. అది మిగుల సౌఖ్యావహము. అమృతఫలము గలిగి దుఃఖనివారకమై

యొప్పుచున్నది. అందు విహరించి యానందింపుము. చూడు. అనేక ద్విజసత్తము లాయాశాఖల శిఖరంబులకు సంబంధించియుండి దాని నాశ్రయించు చుందురు. నామనస్సు పరమశివుని పాదారవిందములను మాత్రము దలంచుచుండుఁగాక యని తాత్పర్యము.

**శ్లో॥ ఆకీర్ణే నఖరాజికాంతివిభవైరుద్యత్సుధావైభవై-**
**రాధౌతేఽపి చ పద్మరాగలలితే హంసవ్రజైరాశ్రితే ।**
**నిత్యం భక్తివధూగణైశ్చ రహసి స్వేచ్ఛావిహారం కురు**
**స్థిత్వా మానసరాజహంస! గిరిజానాథాంఘ్రిసౌధాంతరే ॥ 46**

**టీక :** హే మానసరాజహంస! = ఓ మనస్సను రాజహంసమా!, నఖరాజికాంతివిభవైః = గోటివరుసలయొక్క కాంత్యతిశయములచేత, ఆకీర్ణే = నిండియున్నదియు, ఉద్యత్సుధావైభవైః = దినదినము వృద్ధిఁబొందుచున్న చంద్రుని యమృతకిరణములు వ్యాపించుటచే (సున్నపు పూతలచే), ఆధౌతే = శుభ్రపడినదియు, అపి చ = మఱియును, పద్మరాగలలితే = పద్మములయొక్క యెఱుపువంటి యెఱుపుతో నొప్పునదియు (పద్మరాగమణులు చెక్కినదియు), హంసవ్రజైః = హంసమంత్రధ్యానపరుల సమూహములచేత (హంసల గుంపులచేత), ఆశ్రితే = సేవింపఁబడినదియు నగు, గిరిజానాథాంఘ్రిసౌధాంతరే = పార్వతీపతియొక్క పాదంబను మేడలోపల, రహసి = రహస్యమందు, భక్తివధూగణైస్సహ = భక్తియను భార్యలతోఁగూడ, నిత్యమ్ = ఎప్పుడును, స్వేచ్ఛావిహారమ్ = ఇష్టమైన సంచారమును, కురు = చేయుము.

**చ. వరనఖరాజిరుక్చ్ఛయ విభాసితమున్ విలసత్సుధారస**
**స్ఫురితము, పద్మరాగరుచిజుష్టము, హంసగణాశ్రితం, బుమా**
**వరచరణారవిందమణిసౌధమునందు వసించి భక్తిసుం**
**దరతరుణీవిలాసకలనన్ గను మానసరాజహంసమా!.**

**తా :** ఓ నా మానసరాజహంసమా! నీ వాపార్వతీకాంతుని పాదంబను సౌధాంతరాళమునం దేకాగ్రముగ భక్తికాంతాసమేతవై స్వేచ్ఛావిహారము ననుభవించి యానందింపుము. ఆపాదసౌధము గోళ్ళవరుస మెఱుంగు సమృద్ధిగా వెలుంగ నా చంద్రశేఖరుని మస్తకంబున నిత్యోదితుండైయుండు చంద్రుని యమృతకిరణప్రసారము సున్నపుబూతగను పద్మములవంటి రక్తిమ పద్మరాగముల చెక్కడముగను జెలువొందియున్నదిఁ మఱియు హంస (హంసమంత్రము జపించు వారియొక్క, హంసములయొక్క) సముదాయములచే నిత్యము నాశ్రయింపబడుచున్నది.

**శ్లో॥ శంభుధ్యానవసంతసంగిని హృదారామేఽఘజీర్ణచ్ఛదా-**
**స్స్రస్తా భక్తిలతాచ్ఛటా విలసితా పుణ్యప్రవాళశ్రితాః ।**

**దీప్యంతే గుణకోరకా జపవచఃపుష్పాణి సద్వాసనా**
**జ్ఞానానందసుధామరందలహరీ సంవిత్ఫలాభ్యున్నతిః ॥ 47**

**టీక :** శంభుధ్యాన = ఈశ్వరధ్యానంబను, వసంతసంగిని = వసంతర్తువు సంబంధముగల, హృదారామే = హృదయంబను పూవులతోఁటయందు, ప్రస్తాః = రాలిపోయిన, అఘజీర్ణచ్ఛదాః = పాపంబులనునట్టి పండుటాకులును, విలసితాః = శోభమానములైన, పుణ్యప్రవాళశ్రితాః = పుణ్యములనునట్టి చిగురుటాకులను బొందినవియు, గుణకోరకాః = సద్గుణములనునట్టి మొగ్గలుగలవియు, జపవచఃపుష్పాః = జపవాక్కులను నట్టి పుష్పములు గలవియు, సద్వాసనాః = సత్కర్మ సంస్కారములనునట్టి సువాసనలు గలవియు నగు, భక్తిలతాచ్ఛటాః = భక్తియను తీవ జొంపములును, జ్ఞానానందసుధామరందలహరీ = జ్ఞానము, ఆనందము నను అమృతమకరందములయొక్క ప్రవాహము; సంవిత్ఫలాభ్యున్నతిః = బ్రహ్మజ్ఞానమను ఫలాభివృద్ధియును, దీప్యంతే = ప్రకాశించు చున్నవి.

**శా. ఏనః పర్ణము లెండిరాలి, సుకృతాహీన ప్రవాళంబులన్**
**జానై, సద్గుణ జాలకంబు జపవాచానూనమై, మానసో**
**ద్యానంబందలి భక్తి వల్లిక శివధ్యానంపుఁ బేరామనిన్**
**జ్ఞానానందసుధామరందలహరీ సంవిత్ఫలాప్తిన్ గనెన్.**

**తా :** దేవా! మీ ధ్యానంబు వసంతకాలముగా సంప్రాప్తమగుటవలన నా హృదయంబను పూలతోఁటలో పాపములన్నియు పండుటాకులుగా రాలిపోయినవి. పుణ్యములు చిగురుటాకులుగా మొలకలెత్తినవి. వానిమీఁద సద్గుణములు మొగ్గలుగా బయలుదేరినవి. నవనవలాడుచు మీ భక్తితీవలు సాగుచున్నవి. అందు జపవచనంబులు పుష్పములుగ నుదయించినవి. సత్కర్మసంస్కారములు సువాసన వెదజల్లుచున్నవి. జ్ఞానానందము లమృతమకరందములుగాఁ జాఱుచున్నవి. బ్రహ్మజ్ఞానము ఫలంబుగా స్ఫురించు చున్నది. ఇట్లు నా హృదయ ముద్యానగుణంబు లన్నియుంగల్గి యొప్పారుచున్నది. కనుకనే హృదయారామ మనఁదగియున్నదని తాత్పర్యము.

**శ్లో॥ నిత్యానందరసాలయం సురమునిస్వాంతాంబుజాతాశ్రయం**
**స్వచ్ఛం సద్ద్విజసేవితం కలుషహృత్సద్వాసనావిష్కృతమ్ ।**
**శంభుధ్యానసరోవరం వ్రజ మనోహంసావతంస! స్థిరం**
**కిం క్షుద్రాశ్రయపల్వలభ్రమణసంజాతశ్రమం ప్రాప్స్యసి ॥ 48**

**టీక :** హే మనోహంసావతంస! = ఓ మానసరాజ హంసమా!, ని..యం : నిత్యానంద = శాశ్వతానందమను, రస = ఉదకమునకు, ఆలయమ్ = ఉనికిపట్టును. సు... యం : సుర = దేవతలయొక్కయు, ముని = పరమహంసలయొక్కయు, స్వాంత = హృదయములను,

అంబుజాత = పద్మములకు, ఆశ్రయమ్ = ఆధారమును, స్వచ్ఛమ్ = నిర్మలమును, సద్విజసేవితమ్ = యోగ్యులయిన ద్విజుల (రాజహంసల) చేత సేవింపcబడినదియు, కలుషహృత్ = పాపహరమును, స... తం : సద్వాసనా = సత్కర్మవాసనలచేత (సువాసనల చేత), ఆవిష్కృతమ్ = ప్రకటింపcబడినదియునగు, శం...రం : శంభుధ్యాన = ఈశ్వర ధ్యానంబను, సరోవరమ్ = మంచి సరస్సును, స్థిరమ్ = స్థిరమైన దానిని, వ్రజ = పొందుమా, క్షు... మం : క్షుద్రాశ్రయ = అల్పుల నాశ్రయించుటయను, పల్వల భ్రమణ = పడియలను గుఱించిన త్రిప్పుటచేత, సంజాత = పుట్టిన, శ్రమమ్ = ఆయాసమును, కిమ్ = ఏల, ప్రాప్స్యసి = పొందెదవు.

**మ. అలఁతుల్ సేరెడు పల్వలంబులకు నేలాపోయి కీడొంద, న**
**స్ఖలితానంద రసాలయంబు, మునిరాట్స్వాంతాబ్జ మూలంబు దు**
**ష్కలుషచ్ఛేది, సువాసనాఢ్యము, ద్విజస్ఫారంబు, స్వచ్ఛంబు శం**
**భ్వలఘుధ్యాన సరోవరంబునకుఁబొమ్మా యో మనోహంసమా!**

**తా** : ఓ నా మనోరాజహంసమా! క్షుద్రదేవతల నాశ్రయించుట వల్ల కొన్ని పాపములు తొలఁగినఁ దొలఁగుగాక. శాశ్వతానందము చేకూరదు. అది కేవలము నీరునిలిచెడు చిన్న చిన్న గుంటల కెల్లఁబోయి శ్రమజెందుట గాని వేఱుకాదు. అట్టి వట్టి యాయాస మేల పడియెదవు? శంభుధ్యానము చేయుము. అది మహాసరోవరము. అందు శాశ్వతానందము జలముగను, దేవతలు, మునులు మున్నగువారిచిత్తములు కమలములుగను స్థిరముగా నిండియుండును. బ్రాహ్మణ క్షత్రియాదులగు పెద్దలెల్లరును హంసాదిపక్షులుగా నిత్యము సేవించుచుందురు. అది పాపములెల్లఁ బాపును. సత్కర్మ సంస్కారమున గాని లభింపదు. మంచిమంచి వాసనలను వెదజల్లుచుండును. తక్కిన చెఱువులవలె నది యొకప్పుడును తఱుఁగునది కాదు. బహిరంగ సాధనములను విడచి యంతరంగ సాధనము నవలంబింపు మని ముఖ్యాభిప్రాయము.

**శ్లో॥ ఆనందామృతపూరితా హరపదాంభోజాలవాలోద్యతా**
**స్థైర్యోపఘ్నముపేత్య భక్తిలతికా శాఖోపశాఖాన్వితా ।**
**ఉచ్చైర్మానసకాయమానపటలీమాక్రమ్య నిష్కల్మషా**
**నిత్యాభీష్టఫలప్రదా భవతు మే సత్కర్మసంవర్ధితా ॥ 49**

**టీక :** ఆ... తా : ఆనందా = (శివభక్తియందలి) ప్రేమయను, అమృత = ఉదకముతో, పూరితా = నింపcబడినదియు, హ... తా : హర = శివునియొక్క పదాంభోజ = పాదపద్మమను, ఆలవాల = పాదునుండి, ఉద్యతా = పుట్టిపెరిఁగినదియు, స్థై... ఘ్నం : స్థైర్య = చిత్తస్థైర్యంబను, ఉపఘ్నమ్ = ప్రాపును, ఉపేత్య = పొంది, శాఖోపశాఖాన్విత =

చిలవలు పలవలచేఁగూడుకొనినదియు, ఉచ్చైః = ఉన్నతమైన, మా... లీం : మానస = మనస్సను, కాయమాన = పందిళ్ళయొక్క, పటలీమ్ = సమూహమును, ఆక్రమ్య = అలముకొని, నిష్కల్మషా = చీడమొదలగువానిచే శిథిలము గాక, సత్కర్మసంవర్థితా = పురాకృత పుణ్యకర్మముల (దోహదక్రియల) చేత వృద్ధిబొఁదింపఁబడినదియు నగు, భక్తి లతికా = భక్తియనుతీఁగ, మే = నాకు, నిత్యాభీష్టఫలప్రదా = శాశ్వతమైన నాయభీష్ట ఫలము నిచ్చునది, భవతు = అగుగాక.

**చ. హరచరణాబ్జమన్ గుదుటియందు ముదంబువులన్ బెఱింగి, ని**
**బ్బరమగు తాల్మికంబమునఁ బ్రాకుచు రెమ్మలఁగొమ్మలన్ మనో**
**హరహృదయంపుఁ బందిటనునల్లి, సుకర్మలఁబెంపుజెంది, యే**
**కొఱఁతయులేని భక్తిలత కూర్చుత నిత్యఫలప్రసాదమున్.**

**తా :** పరమేశ్వరసేవానురక్తి నీరుపోతగను, పరశివచరణకమలము పాదుగను, జిత్తస్థైర్యము ప్రాకుఁదుకంపగను ..... బయలుదేరి చిలవలపలవల నల్లుకొనుచుఁ గ్రమముగా నున్నతమైన నామనస్సనియెడు పందిరి .........కొని చీడమున్నగు దోషములచే శిథిలము గాకుండనున్న యీ భక్తిలతా....కృత పుణ్యకర్మమను దోహదక్రియలచేఁ బెంపొంది నామనోభీష్టమగు శాశ్వతఫలంబును ఫలించుగాత.

**శ్లో॥ సంధ్యారంభవిజృంభితం శ్రుతిశిరఃస్థానాంతరాధిష్ఠితం**
**సప్రేమభ్రమరాభిరామమసకృత్సద్వాసనాశోభితమ్ ।**
**భోగీంద్రాభరణం సమస్తసుమనఃపూజ్యం గుణావిష్కృతం**
**సేవే శ్రీగిరిమల్లికార్జునమహాలింగం శివాలింగితమ్ ॥ 50**

**టీక :** సం... తం : సంధ్యారంభ = సాయంకాలమందు, విజృంభితమ్ = తాండవనృత్యమున విజృంభించునట్టియు (పుష్పములు వికసించునదియు), శృ... తం : శ్రుతిశిరస్స్థానాంతర = వేదములకు శిరస్థానములైన యుపనిషత్తులను నితరస్థలమందు (చెవులయందును, తలమీఁదను), అధిష్ఠితమ్ = బోధ్యముగానున్నదియు (అలంకారముగ నున్నదియు), స... మం : సప్రేమ = ప్రేమతోఁగూడిన, భ్రమరా(ర) = భ్రమరాంబికచేతను (తుమ్మెదల చేతను), అభిరామమ్ = మనోహరమైనట్టియు, అసకృత్ = ఎల్లప్పుడును, సం... తం : సద్వాసనా = సాధువులయొక్క భావనచేత (మంచిసువాసనచేత), శోభితమ్ = ఒప్పునట్టియు, భో... ణం : భోగీంద్ర = వాసుకి (భోగవంతులకు), ఆభరణమ్ = భూషణముగాఁ గలిగినట్టి భోగపురుషులకు ఆభరణమయినటువంటి, సమస్తసుమనఃపూజ్యం : సమస్త = సమస్తమయిన, సుమనః = దేవతలకు, పూజ్యమ్ = పూజచేయతగినటువంటి, సకలమయిన పుష్పముల లోపల శ్రేష్ఠమయినటువంటి, గుణావిష్కృతిమ్ = సత్త్వగుణ ప్రకాశితమయినట్టి గంధాది

గుణములచేత ప్రకాశితమయినట్టి, శ్రీగిరిమల్లికార్జునమహాలింగం : శ్రీగిరి = శ్రీశైల మందున్నట్టి మల్లికార్జున = మల్లెతీగెలతో గూడుకొన్న మద్దిచెట్టుతో సమానమైనట్టి, మహాలింగమ్ = సాంబశివుని, సేవే = సేవించుచున్నాను.

మ. తతసంధ్యోద్ధత మున్నతశ్రుతిశిరస్స్థానాంతరన్యస్త మం
చితరాగభ్రమరాభిరామము, గుణశ్రీకంబు భోగీడలం
కృత ముద్యత్సుమనః ప్రపూజ్యము శివాంగీకార్య ముద్వాసనా
యతమౌ శ్రీగిరిమల్లికార్జునమహోదృల్లింగముం గొల్చెదన్.

**తా** : పార్వతీదేవిచేత ఆలింగనము చేయబడి సాయంకాలమందు భక్తానుగ్రాహక మయినట్టియు పుష్పవికాసమును బొందినట్టియు, అనగా భక్తులను అనుగ్రహించునట్టి వేదాంతస్థానములయందున్నట్టియు శిరస్సునందును చెవులయందునున్నట్టి, ప్రేమతో గూడుకొన్న భ్రమరాంబతోడను తుమ్మెదచేతనుకూడుకొన్నట్టి, మాటిమాటికి సత్పురుష భావనచేతను మంచివాసనచేతను ప్రకాశించునట్టివాసుకి ఆభరణముగా కలిగినట్టియు భోగ పురుషులకు ఆభరణమయినట్టియు సకల దేవతలకు పూజ్యమయినట్టియు సకల పుష్పముకు శ్రేష్ఠమయినట్టి సత్వగుణప్రకాశకమయినట్టియు గంధాది గుణములచేత ప్రకాశించునట్టి, శ్రీగిరి మల్లికార్జున మహాలింగమును అనగా మల్లికార్జున అన్నప్పుడు మల్లెపుష్పమున్ను అర్థమవుచున్నది గనుక ఆలాగంటి సాంబశివుని సేవించుచున్నానని తాత్పర్యము.

**శ్లో॥ భృంగీచ్ఛానటనోత్కటః కరిమదగ్రాహీ స్ఫురన్మాధవా-**
**హ్లాదో నాదయుతో మహాసితవపుః పంచేషుణా చాదృతః ।**
**సత్పక్షస్సుమనోవనేషు స పునస్సాక్షాన్మదీయే మనో**
**రాజీవే భ్రమరాధిపో విహరతాం శ్రీశైలవాసీ విభుః ॥ 51**

**టీక :** భృంగీచ్ఛానటనోత్కటః : భృంగీ = భృంగియను ప్రమథునియొక్క నటన = నాట్యమందు, ఉత్కటః = ఇచ్ఛగలిగినట్టియు, భృంగీ = ఆడతుమ్మెదయొక్క నటన = నాట్యమందు, ఉత్కటః = ఆసక్తి గలిగినట్టి, కరిమదగ్రాహీ = గజాసురునియొక్క మదమును గ్రహించిన, స్ఫురన్మాధవాహ్లాదః : స్ఫురత్ = ప్రకాశించుచున్న, మాధవ = మోహినీరూపమును బొందిన విష్ణుదేవునియందు, ఆహ్లాదః = సంతోషము కలిగినట్టియు, ప్రకాశించుచున్న వైశాఖమాసమందు సంతోషము గలిగినట్టి, నాదయుతః=ప్రణవనాదముతో కూడుకొన్నట్టియు, ఝుంకారధ్వనితో గూడుకొన్నట్టి, మహాసితవపుః : గొప్పైన తెల్లని శరీరము కలిగినట్టియు, గొప్పైన నల్లశరీరము కలిగినట్టియు, పంచేషుణా చ = మన్మథునిచేత, ఆదృతః : స్వబాణలక్ష్య భావముచేత నిశ్చయింపబడినట్టియు, ఆదరణచేయబడినటువంటి, సుమనోవనేషు : సుమనః

= దేవతలయొక్క, అవనేషు = రక్షణములయందును, సుమనః = పుష్పములయొక్క, వనేషు = ఉద్యానాదులయందు, సత్పక్షః = విద్యమానాభిమానము కలిగినట్టియు, చక్షురా-దీంద్రియగోచరమయినట్టియు, శ్రీశైలవాసీ = శ్రీశైలమందు వాసముగానున్నట్టి, విభుః = ప్రభువైన, భ్రమరాధిపః = భ్రమరాంబికకు పతియైన సాంబశివుఁడును, భృంగశ్రేష్ఠమును, సాక్షాత్ = సాక్షాత్కారముగాను, మదీయే = నాసంబంధమైన, మనోరాజీవే = మనఃకమల మందు, విహరతామ్ = విహరించుగాక.

**శా. భృంగీచ్ఛానటనోత్కటుం, డురుకరీట్ప్రేంఖన్మదగ్రాహకుం**
**డుం, గామాదృతుఁడున్ మహాసితతనుండున్, మాధవాహ్లాది స**
**త్సంగుండున్ సుమనోవనప్రియుఁడు, నాదవ్యక్తి, శ్రీశైలమం**
**దుంగాపొ భ్రమరాధిపుం డలరుచుండున్ నా మనోబ్జంబునన్.**

**తా** : భ్రమరాధిపః అన్నందున భ్రమరాంబికాపతియైన సాంబశివుడును, భ్రమరశ్రేష్ఠమును నామనఃకమలమందు విహరించుగాక అని అర్థమగుచున్నది కనుక తుమ్మెదయందునుండెడు ధర్మములనన్నిటిని సాంబశివునయందు కలుగచేసి స్తోత్రము చేసినాఁడు.

**శ్లో॥ కారుణ్యామృతవర్షిణం ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం**
**విద్యాసస్యఫలోదయాయ సుమనస్సంసేవ్యమిచ్ఛాకృతిమ్ ।**
**నృత్యద్భక్తమయూరమద్రినిలయం చంచజ్జటామండలం**
**శంభో! వాంఛతి నీలకంధర! సదా త్వాం మే మనశ్చాతకః ॥ 52**

**టీక :** హే నీలకంధర! = ఓయి నల్లని కంఠముగలవాడా!, నల్లని యుదకమును ధరించి యుండెడి మేఘమా! శంభో! = సుఖకరుడవియినవాఁడా!, కారుణ్యామృతవర్షిణమ్ = కరుణారసమనెడి అమృతమును వర్షించునట్టియు, కరుణతో ఉదకమును వర్షించునట్టి, ఘనవిపద్గ్రీష్మచ్ఛిదాకర్మఠం : ఘన = గొప్పైన, విపత్ = ఆపదలనెడు, గ్రీష్మ = తాపముయొక్క, ఛిదా = ఛేదించుటయందు, కర్మఠమ్ = కర్మశూరుడయినట్టి, ఘన = గొప్పైన, విపత్ = సస్యాది శోషణ రూపవిపత్తు కలిగిన, గ్రీష్మ = గ్రీష్మఋతువుయొక్క, ఛిదా = ఛేదించుట యందు, కర్మఠమ్ = సమర్థమయినట్టి, విద్యాసస్యఫలోదయాయ : విద్యా = విద్యయనెడి, సస్యఫలోదయాయ : విద్యా = విద్యయనెడి, సస్య = పయిరుయొక్క, ఫలోదయాయ = ఫలోదయము కొరకు, సుమనః సంసేవ్యం : సుమనః = దేవతలచేతను పెద్దలచేతను, సంసేవ్యమ్ = సేవింపదగినట్టియు, సస్యఫలోదయముకొరకు కర్షకులచేత సేవింపదగినట్టి, నృత్యద్భక్తమయూరమ్ = నాట్యము చేయుచు నుండెడు భక్తులను నెమళ్లు కలిగినట్టియు నాట్యముచేయుచునుండె మేఘమందు ప్రీతికలిగిన నెమళ్లు కలిగినట్టి, అద్రి నిలయమ్ = కైలాస పర్వతమందుండునట్టియు పర్వతమందుండునట్టి, చంచజ్జటామండలం : చంచత్

= కదలుచుండెడు జటామండలము కలిగినటువంటియు మెరుపులయొక్క సమూహము కలిగినట్టి, త్వామ్ = నిన్ను, సదా = ఎల్లప్పుడు, మే = నాయొక్క, మనశ్చాతకః : మనః = మనస్సనెడి, చాతకః = వర్షబిందువులను భక్షించి జీవించెడి పక్షి, వాంఛతి = కోరుచున్నది.

**చం.** **పరుషవిపత్తపాతపమపారదయారసవృష్టిమాన్చుచున్**
**బరిణతిఁజూపి విద్దియలపంటకుఁ జారుజటాజటాలుఁడై**
**వరసుమనోగణంబలర, భక్తమయూరులుగొల్వనద్రిపై**
**మురసెఁడు నీలకంధర విభున్ మతిచాతకమిచ్ఛగించెడిన్.**

**తా** : నీలకంధర అన్నందున నల్లనిమెడ కలిగిన సాంబశివునికిన్ని నల్లని యుదకమును ధరించిన మేఘమునకును అర్థమయినందున వర్ష బిందువులను పానము చేసి జీవించెడి చాతక పక్షినిబోలిన నా మనస్సు మేఘమునందలి ధర్మములు కలిగియున్న నిన్ను కోరుచున్నది అని తాత్పర్యము.

**శ్లో॥** **ఆకాశేన శిఖీ సమస్తఫణినాం నేత్రా కలాపీ నతాను-**
**గ్రాహిప్రణవోపదేశనినదైః కేకీతి యో గీయతే ।**
**శ్యామాం శైలసముద్భవాం ఘనరుచిం దృష్ట్వా నటంతం ముదా**
**వేదాంతోపవనే విహారరసికం తం నీలకంఠం భజే ॥ 53**

**టీక :** ఆకాశేన = ఆకాశముచేతను, శిఖీ = శిఖగలవాఁడు, అనగా వ్యోమకేశుఁడైనట్టిన్ని, శిఖీ = శిఖండముగలిగినట్టిన్ని, సమస్తఫణినాం : సమస్త = సకలమయిన, ఫణినామ్ = సర్పములకు, నేత్రా = ప్రభువైన వాసుకిచేతను, కలాపీ = భూషణములు కలవాఁడైనటు వంటిన్ని, కలాపములు కలిగినటువంటిన్ని, నతానుగ్రాహిప్రణవోపదేశనినదైః = నతానుగ్రాహి = నమ్రులను అనుగ్రహించెడి, ప్రణవ+ఉపదేశ = ఓంకారముయొక్క, నినదైః = ధ్వనులచేతను, కేకి = కేకాధ్వనులు కలిగినట్టిన్ని, శ్యామామ్ = నల్లనయినటువంటిన్ని, శైలసముద్భవామ్ = పర్వతమందుఁబుట్టినటువంటి పార్వతినిన్ని, ఘనరుచిమ్ = మేఘకాంతినిన్ని, దృష్ట్వా = చూచి, నటంతమ్ = నాట్యముచేయుచున్నట్టిన్ని, వేదాంతోపవనే : వేదాంత = ఉపనిషత్తులనెడి, ఉపవనే = క్రీడావనమందు, విహారరసికం : విహార = విహరించుటయందు, రసికమ్ = పరవశుఁడయినట్టి, తమ్ = ఆ, నీలకంఠమ్ = నల్లని కంఠము కలిగినట్టి, సాంబశివుఁడను నెమలిని, ముదా = సంతోషముతో, అహమ్ = నేను, భజే = సేవించుచున్నాను.

**చ.** **అనఘకలాపియై ఫణికులాధిపుచే, శిఖియై నభంబుచే,**
**వినతజనావనప్రణవ విస్తరబోధనచేతఁ గేకియై,**

ఘనరుచి శ్యామ నద్రిజను గాంచి నటించెడు నీలకంఠుఁబ్రా
మినుకులతోఁటలోఁదిరుగు మేటిరసజ్ఞు భజింతునిచ్చలున్.

**తా** : అనగా నీలకంఠం అన్నందున నెమలియందుఁగలిగియుండెడు యావద్ధర్మములును సాంబశివునియందుఁ గలిగియున్నవిగాన నట్టి సాంబశివుని మిక్కిలి సంతోషము చేత నేను సర్వదా సేవించుచున్నానని తాత్పర్యము.

**శ్లో॥ సంధ్యాఘర్మదినాత్యయోహరికరాఘాతప్రభూతానక-**
**ధ్వానో వారిదగర్జితం దివిషదాం దృష్టిచ్ఛటాచంచలా ।**
**భక్తానాం పరితోషబాష్పవితతిర్వృష్టిర్మయూరీ శివా**
**యస్మిన్నుజ్జ్వలతాండవం విజయతే తం నీలకంఠం భజే ॥ 54**

**టీక :** సంధ్యాఘర్మదినాత్యయః : సంధ్యా = సాయంకాలసమయమనెడి, ఘర్మదినాత్యయః : ఘర్మదినా = గ్రీష్మర్తుదివసములందు, అత్యయః = అతిక్రమించునటువంటిన్ని, మేఘప్రాదుర్భావ కాలముగాను, అనగాఁ దొలుకటిగాను, హరికరాఘాతప్రభూతానకధ్వానః : హరి = విష్ణువుయొక్క, కరా = హస్తములచేత, ఆఘాత = వాయింపఁబడుటచేత, ప్రభూత = పుట్టిన, ఆనక = ఆనకమను వాద్యవిశేషముయొక్క ధ్వానః = ధ్వని, వారిదగర్జితం : వారిద = మేఘముయొక్క, గర్జితమ్ = ఉరుముగా, దివిషదామ్ = దేవతలయొక్క, దృష్టిచ్ఛటాచంచలా : దృష్టి = చూపులయొక్క, ఛటా = సమూహము, చంచలా = మెరుపుతీఁగెగాను, భక్తానామ్ = భక్తులయొక్క, పరితోషబాష్పవితతిః : పరితోషబాష్ప = ఆనందాశ్రువులయొక్క, వితతిః = సమూహము, వృష్టిః = ఎడతెగనివానగాను, శివా = పార్వతీదేవి, మయూరీ = ఆడునెమలిగాను, యస్మిన్ = ఏ నీలకంఠునియందు, ఉజ్జ్వల తాండవం : ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, తాండవమ్ = నాట్యము, విజయతే = సర్వోత్కృష్టము ను బొందుచున్నదో, తమ్ = ఆ నీలకంఠుని, భజే = సేవించుచున్నాను.

చ. అల గోవిందు మృదంగపుంధ్వనియె గర్జారంభమై వేల్పుట
య్యలచూపుం గములే మెఱుంగులయి భక్తానందబాష్పంపు సో
నలజాల్వానగ సంజన్ దొలుకరిన్ గౌరీమయూరీమనం
బలరన్ దాండవమాఁడు నీలగళు నాట్యానర్గళున్ గొల్చెదన్.

**తా** : సాయంకాలసమయము తొలుకరి గాను, విష్ణువు వాయించు మృదంగధ్వని ఉరుముగాను, దేవతలచూపులు మెరుపులుగాను, భక్తులయొక్క ఆనందాశ్రుసమూహము వర్షముగాను, పార్వతీదేవి ఆడునెమలిగాను, ఏ నీలకంఠునియందు ఉజ్జ్వలతాండవము ప్రకాశించుచున్నదో ఆ నీలకంఠు సేవించుచున్నానని తాత్పర్యము.

**శ్లో॥ ఆద్యాయామితతేజసే శ్రుతిపదైర్వేద్యాయ సాధ్యాయ తే**
**విద్యానందమయాత్మనే త్రిజగతస్సంరక్షణోద్యోగినే ।**
**ధ్యేయాయాఖిలయోగిభిస్సురగణైర్గేయాయ మాయావినే**
**సమ్యక్తాండవసంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే ॥ 55**

**టీక :** ఆద్యాయ = జగదుత్పత్తికిఁబూర్వమున్నటువంటి, అమితతేజసే : అమిత = అపరిమితమైనట్టి, తేజసే = జ్యోతిఃస్వరూపుఁడైన, శ్రుతిపదైః = వేదవాక్యములచేత, వేద్యాయ = తెలిసికోదగిన, సాధ్యాయ = భక్తానుగ్రహార్థము ప్రతిష్ఠింపఁబడ్డ, విద్యానందమయాత్మనే = చిదానందాభిన్న స్వరూపము కలిగినట్టి, త్రిజగతః = త్రిలోకములయొక్క, సంరక్షణోద్యోగినే : సంరక్షణ = రక్షించుటయొక్క, ఉద్యోగినే = ఉద్యోగము కలిగినటువంటి, అఖిలయోగిభిః : అఖిల = సమస్తమయిన, యోగిభిః = యోగీశ్వరులచేత, ధ్యేయాయ = ధ్యానం చేయఁదగినట్టి, సురగణైః = దేవసమూహములచేతను, గేయాయ = గానం చేయఁదగినట్టి, మాయావినే = మాయాశక్తిని కలిగినట్టి, సమ్యక్తాండవసంభ్రమాయ : సమ్యక్ = లెస్సగా, తాండవమ్ = నర్తనమందు, సంభ్రమాయ = త్వరకలిగినట్టి, జటినే = మునివేషధారి అయిన, సేయమ్ = ఆ యీ, శంభవే = ఈశ్వరుని కొరకు, నతిః = నమస్కారము.

**సీ. ప్రకృతికి మించి య వ్వల వెలింగెడు వాని**
**నమితతేజోమూర్తి యైనవాని**
**తొలిపల్కుగములచేఁ దెలయంగఁదగువాని**
**నర్చాదులకు సాధ్యుఁ డైనవాని**
**మహితవిద్యానంద మయమూర్తియగువాని**
**నఖిలలోకములులేలు నట్టివాని**
**మౌనీశ్వరులచేత ధ్యానింపఁదగువాని**
**జేజేకొలంబు భూ షించువాని**

**గీ. అప్రమేయు నమేయమా యావిహారి**
**తాండవారంభసంభ్రమో ద్దండుఁడైన**
**మొదలిజడదారిఁ బ్రమథుల మొదలియారి**
**అఘవిదారిఁ దలంచి జో హారులిడుదు.**

**తా :** అనగా జగత్తునకుఁబూర్వమున నున్నట్టియు, మహాజ్యోతిఃస్వరూపుఁడైనట్టియు వేదవాక్యములచేఁ దెలియఁదగినట్టియు, భక్తానుగ్రహార్థము ప్రతిష్ఠింపఁబడినట్టియు, సదానందస్వరూపము కలిగినట్టియు, మూఁడులోకములను సంరక్షించెడు ఉద్యోగము కలిగినట్టియు, సమస్తయోగీశ్వరులచేతను ధ్యానము చేయతగినట్టియు, దేవతలచేత గానము

చేయతగినట్టియు, మాయాశక్తియుక్తుడైనట్టియు, లెస్సగా సాయంకాలము తాండవము చేయుటయందు త్వరకలిగినట్టియు, మునివేషధారి అయినట్టియు, సుఖకరుడయిన ఆ యీశ్వరునికొరకు నమస్కారము అని తాత్పర్యము.

**శ్లో॥ నిత్యాయ త్రిగుణాత్మనే పురజితే కాత్యాయినీశ్రేయసే**
**సత్యాయాదికుటుంబినే మునిమనఃప్రత్యక్షచిన్మూర్తయే ।**
**మాయాసృష్టజగత్రయాయ సకలామ్నాయాంతసంచారిణే**
**సాయం తాండవసంభ్రమాయ జటినే సేయం నతిశ్శంభవే ॥ 56**

**టీక :** నిత్యాయ = నిత్యుఁడైనటువంటి, త్రిగుణాత్మనే = సత్త్వరజస్తమోగుణములు, శరీరములుగాఁ గలిగినటువంటి, అనగా బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపుఁడయినటువంటి, పురజితే = స్థూలసూక్ష్మకారణరూపములను జయించినటువంటి, లేక త్రిపురములను జయించినటువంటి, కాత్యాయనీశ్రేయసే : కాత్యాయనీ = పార్వతీదేవియొక్క శ్రేయసే = తపఃఫలస్వరూపుడయినటువంటి, సత్యాయ = కాలత్రయాబాధ్యసత్యస్వరూపుఁడైనటువంటి, ఆదికుటుంబినే = ప్రాథమిక సంసారి అయినటువంటి, మునిమనఃప్రత్యక్షచిన్మూర్తయే : ముని = మునీశ్వరులయొక్క, మనః = మనస్సులకు, ప్రత్యక్ష = గోచరమయిన, చిన్మూర్తయే = చిత్స్వరూపుఁడయినటువంటి, మాయాసృష్టజగత్రయాయ : మాయా = మాయచేత, సృష్ట = సృజింపఁబడ్డట్టి, జగత్రయాయ = త్రిలోకములు కలిగినటువంటి, సకలామ్నాయాంత సంచారిణే : సకల = సమస్తమయిన, ఆమ్నాయాంత = వేదాంతములయందు, సంచారిణే = సంచరించునట్టి, సాయమ్ = సాయంకాలమందు, తాండవసంభ్రమాయ : తాండవ = నాట్యమందు, సంభ్రమాయ = త్వరకలిగినట్టి, శంభవే = ఈశ్వరుని కొరకు, సేయమ్ = ఆ యీ, నతిః= నమస్కారము.

**మ. తలఁతు న్నిత్యు, గుణత్రయాత్ముఁ, బురహంతన్ బార్వతీసత్తపః**
**ఫలమున్, బ్రాక్తనపుంగుటుంబిని, మునిః ప్రత్యక్షచిన్మూర్తి, ని**
**శ్చలు, మాయాపరికల్పితాఖిలజగజ్జాలున్, ద్రయీవేద్యు, ని**
**స్తులసాయంనటనోద్భటున్ జటి, మహేశున్ దీనచింతామణిన్.**

**తా** : అనగా నిత్యుఁడును సత్త్వరజస్తమోగుణస్వరూపుఁడును, స్థూలసూక్ష్మకారణ స్వరూపములయిన త్రిపురములను జయించినవాఁడును, పార్వతీతపఃఫలస్వరూపుఁడును, కాలత్రయాబాధ్యసత్యస్వరూపుఁడును, ప్రథమసంసారియు, మునీశ్వరులయొక్క మనస్సులకు గోచరమగుచిత్స్వరూపుఁడును మాయచేత సృజింపఁబడ్డ మూఁడులోకములు కలిగిన వాఁడును, వేదాంతములయందు సంచరించువాఁడును సాయంకాలనర్తనమందు వ్యగ్రుఁడును అయిన సాంబమూర్తి కొరకు నమస్కరించుచున్నాను అని తాత్పర్యము.

శ్లో॥ నిత్యం స్వోదరపోషణాయ సకలానుద్దిశ్య విత్తాశయా
వ్యర్థం పర్యటనం కరోమి భవతస్సేవాం న జానే విభో! ।
మజ్జన్మాంతరపుణ్యపాకబలతస్త్వం శర్వ! సర్వాంతర-
స్తిష్ఠస్యేవ హి తేన వా పశుపతే! తే రక్షణీయోఽస్మ్యహమ్ ॥ 57

**టీక :** నిత్యమ్ = ఎల్లప్పుడు, స్వోదరపోషణాయ : స్వ = స్వకీయమైన, ఉదర = కుక్షియొక్క, పోషణాయ = పోషణకొరకు, విత్తాశయా = ధనవాంఛచేతను, సకలాన్ = సకలమైన వారలను, ఉద్దిశ్య = ఉద్దేశించి, వ్యర్థమ్ = నిష్ప్రయోజనమయిన, పర్యటనమ్ = తిరుగుటను, కరోమి = చేయుచున్నాను, హే విభో! = సర్వవ్యాపకుఁడవైన ఓ యీశ్వరుఁడా, భవతః = నీయొక్క, సేవామ్ = భజనమును, న జానే = గురుతెఱుఁగను, హే పశుపతే! = ఓ బ్రహ్మాది సమస్తజీవులకును ప్రభువైన యీశ్వరుఁడా!, యస్మాత్ కారణాత్ = ఏ కారణము వల్ల, మజ్జన్మాంతరపుణ్యపాకబలతః : మత్ = నా యొక్క, జన్మాంతర = అన్యజన్మముల యందలి, పుణ్య = సుకృతములయొక్క, పాకబలతః = పరిపక్వబలమువలనను, హే శర్వ! = ఓయి యీశ్వరుఁడా!, సర్వాంతరః : సర్వ = సమస్తమైన, అన్నమయాదికోశముల వల్లను, అంతరః = సూక్ష్మరూపుఁడవై, తిష్ఠస్యేవ = ఉన్నావో, తేన = ఆ హేతువుచేతను, అహమ్ = నేను, రక్షణీయః = రక్షింపఁదగినవాఁడను, అస్మి = అగుచున్నాను.

మ. అకటా! నిత్యము పొట్టనింపుకొన విత్తాశన్ సదా కొంపకొం
పకు నల్లాడుదుగాని నీచరణసేవం జేయ; మత్పూర్వజ
న్మకృతంబౌ సుకృతంబుచేత సకలాంతర్యామివౌ నీవు, మా
నక నాయందును లేకపోవిఁక ననంతా! నన్ను బ్రోవందగున్.

**తా :** ఓయి పశుపతే! నీకు రక్షించుటకు యోగ్యుఁడైన వాఁడ నగుచున్నాను గాన, నన్ను రక్షించవలయునని ముఖ్య తాత్పర్యము.

శ్లో॥ ఏకో వారిజబాంధవః క్షితినభోవ్యాప్తం తమోమండలం
భిత్త్వా లోచనగోచరోఽపి భవతి త్వం కోటిసూర్యప్రభః ।
వేద్యః కిం న భవస్యహో! ఘనతరం కీదృగ్భవేన్మత్తమ-
స్తత్సర్వం వ్యపనీయ మే పశుపతే! సాక్షాత్ప్రసన్నో భవ ॥ 58

**టీక :** హే పశుపతే! = ఓయి సాంబశివుఁడా!, వారిజబాంధవః = పద్మబాంధవుఁడైన సూర్యుఁడు, ఏకస్సన్ = ఒక్కఁడే, క్షితినభోవ్యాప్తమ్ : క్షితి = భూమియందును, నభః = ఆకాశమందు, వ్యాప్తమ్ = వ్యాపించియున్న, తమోమండలమ్ = అంధకార సమూహమును, భిత్త్వా = భేధించి, లోచనగోచరోఽపి : లోచన = నేత్రములకు, గోచరోఽపి = అగపడు

చుండువాఁడును, భవతి = అవుచున్నాఁడు, త్వం తు = నీవైతే, కోటిసూర్యప్రభః : కోటిసూర్య = అపరిమితులైన సూర్యులయొక్క ప్రభః = కాంతివంటి కాంతిగలిగినవాఁడవై, వేద్యః = తెలిసికొనదఁగినవాఁడవు, కిన్న భవసి = యేమిటికి కావు, అహో! = ఆశ్చర్యము!, ఘనతరమ్ = మిక్కిలి దట్టమైనటువంటి, మత్తమః : మత్ = నాయొక్క, తమః = అజ్ఞానమును, కీదృక్ = యెంతమాత్రము, భవేత్ = అగును, తత్తస్మాత్ = ఆకారణమువలన, సర్వమ్ = సమస్తమయిన అంధకారమును, వ్యపనీయ = పోగొట్టి, సాక్షాత్ = ప్రత్యక్షముగాను, ప్రసన్నశ్చ = అనుగ్రాహకుఁడవు, భవ = కమ్ము.

**మ. అరుణుండొక్కఁడె భూనభోంతరతమోహంకారమున్ మాన్పి గో**
**చరుఁడౌదృష్టికి, నీవు కోట్యరుణభాస్వత్కాంతివై యెందు నె**
**వ్వరికిం గన్పడవేమి చిత్రమిది? మాన్పన్ భారమామత్తమ**
**స్స్ఫురణంబున్ గరుణన్ వహింపుమిఁక, శంభూ! సుప్రసన్నత్వమున్.**

**తా** : ఒక సూర్యుఁడే సకలజనులకు ప్రత్యక్షమగుచున్న వాఁడవుచు భూమ్యంతరిక్ష వ్యాపియయిన అంధకారమును పోగొట్టుచున్నాఁడు, నీవు కోటిసూర్యసమాన తేజస్కుంఁడ వైనను అప్రత్యక్షుఁడవై మనస్సును భేదించకయున్నావు గానయిది చిత్రము ఆశ్చర్యము అందువలన నీవు ప్రత్యక్షుఁడవయి పాపములను నశింపఁజేయుమా యని ముఖ్యతాత్పర్యము.

**శ్లో॥ హంసః పద్మవనం సమిచ్ఛతి యథా నీలాంబుదం చాతకః**
**కోకః కోకనదప్రియం ప్రతిదినం చంద్రం చకోరస్తథా ।**
**చేతో వాంఛతి మామకం పశుపతే! చిన్మార్గమృగ్యం విభో!**
**గౌరీనాథ! భవత్పదాబ్జయుగళం కైవల్యసౌఖ్యప్రదమ్ ॥ 59**

**టీక :** హే పశుపతే! = ఓయి సకలభూతములకును అధిపతివైనవాఁడా, హే గౌరీనాథ! = ఓయి పార్వతీమనోహరుఁడవయిన ఈశ్వరుఁడా, హంసః = హంసము, పద్మవనమ్ = కమలషండమును, యథా = ఏ ప్రకారముగా, సమిచ్ఛతి = ఇచ్ఛగించుచున్నదో, చాతకః = చాతకపక్షి, నీలాంబుదమ్ = వార్షికమేఘమును, యథా = ఏ ప్రకారము, వాంఛతి = యిచ్ఛయించుచున్నదో, కోకః = చక్రవాకపక్షి, కోకనదప్రియమ్ = సూర్యుని, యథా = ఏ ప్రకారము, వాంఛతి = యిచ్ఛయించుచున్నదో, చకోరః = చంద్రకిరణపాయియయిన చకోరపక్షి, ప్రతిదినమ్ = ప్రత్యహమును, చంద్రమ్ = చంద్రుని, యథా = ఏ ప్రకారముగాను, సమిచ్ఛతి = యిచ్ఛయించుచున్నదో, తథా = ఆ ప్రకారముగాను, మామక = నాసంబంధమైన, చేతః = చిత్తము, చిన్మార్గమృగ్యమ్ : చిన్మార్గ = ఉపనిషన్మార్గములయందు, మృగ్యమ్ = వెదకఁదగినటువంటి, కైవల్యసౌఖ్యప్రదమ్ : కైవల్య = కేవలనిర్గుణబ్రహ్మభావమనెడి, సౌఖ్య

= సుఖమును, ప్రదమ్ = యిచ్చుచునుండెడి, భవత్పదాబ్జయుగళమ్ : భవత్ = నీయొక్క పదాబ్జ = పాదకమలములయొక్క, యుగళమ్ = ద్వంద్వమును, వాంఛతి = అభిలషించు చున్నది.

**చ. నిరతము వానకోయిల వినీలపయోధరమున్ మరాళ మం**
**బురుహవనంబు, జక్కవ నభోమణి, వెన్నెలపుల్గు యామినీ**
**శ్వరు వలె, నామనం బుపనిషచ్ఛ్రుతిపాద్యము, ముక్తిసంస్క్రియా**
**కరమగు నీ పదాంబుజయుగంబె తలంచు; నుమామహేశ్వరా!.**

**తా** : అనగా ఓయి సకల భూతములకును అధిపతివైన గౌరీనాథుఁడా! హంసము పద్మవనమును, చాతకము వార్షిక మేఘమును, చక్రవాకము సూర్యుని, చకోరపక్షి చంద్రుని ఏరీతి నభిలషించుచున్నవో ఆ ప్రకారము నాయొక్క చిత్తము ఉపనిషన్మార్గములయందు వెదకఁదగిన కేవల నిర్గుణబ్రహ్మభావమనెడి సుఖమిచ్చుచున్న నీపాదకమలద్వంద్వమును గోరుచున్నదని తాత్పర్యము.

**శ్లో॥ రోధస్తోయహృతః శ్రమేణ పథికశ్ఛాయాం తరోర్వృష్టితో**
**భీతస్స్వస్థగృహం గృహస్థమతిథిర్దీనః ప్రభుం ధార్మికమ్ ।**
**దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృతస్త్వం తథా**
**చేతస్సర్వభయాపహం వ్రజ సుఖం శంభోః పదాంభోరుహమ్ ॥ 60**

**టీక :** హే చేతః! = ఓ మానసమా!, తోయహృతః = ఉదకవేగముచేత, ఆకర్షింపఁబడ్డ పురుషుఁడు, రోధః = తీరమును, యథా = ఏ ప్రకారమో, పథికః = త్రోవనడిచెడువాఁడు, శ్రమేణ = మార్గశ్రమచేత, తరోః = వృక్షముయొక్క, ఛాయామ్ = నీడను, యథా = ఏ ప్రకారమో, వృష్టితః = వర్షమువలన, భీతః = భయపడినవాఁడు, స్వస్థగృహమ్ = సుఖముగా ఉండతగిన యింటిని, యథా = ఏ ప్రకారముగానో, అతిథిః = అభ్యాగతపురుషుఁడు, గృహస్థమ్ = గార్హస్థ్యధర్మయుక్తుఁడయిన సంసారిని, యథా = ఏ ప్రకారముగానో, దీనః = దరిద్రుఁడు, ధార్మికమ్ = దాత అయిన ప్రభువును, యథా = ఏ ప్రకారము గానో, సంతమసాకులః = గాఢాంధకార పీడిత పురుషుఁడు, దీపమ్ = దీపమును, యథా = ఏ ప్రకారముగానో, శీతావృతః : శీత = చలిచేత, ఆవృతః = వ్యాపించబడ్డ పురుషుఁడు, శిఖినమ్ = అగ్నిహోత్రుని, యథా = ఏ ప్రకారముగానో, తథా = ఆ ప్రకారముగాను, త్వమ్ = నీవు, సర్వభయాపహమ్ = సకల భయములను పోగొట్టి, సుఖకరమ్ = సుఖము చేయుచున్న, శంభోః = సాంబశివునియొక్క, పదాంభోరుహమ్ = పాదకమలమును, వ్రజ = పొందుమా.

చ. వడఁబడునాఁడు నీడయుఁ, బ్రవాహమునన్ బడ నొడ్డు, పెంజడిన్
దడియ గృహంబు, పేదవడ దాత, చలిన్ సెగ, చిమ్మచీఁగటిన్
బడలిన దివ్వెఁ గోరఁదగు భాతి, భవార్తిదొలంగి సౌఖ్యముం
బడయఁదలంచి తేని మనమా! హరపాదములాశ్రయింపుమా.

**తా** : ఓ మానసమా! ఉదకవేగముచేత ఆకర్షింపఁబడ్డ పురుషుఁడు దరిని, త్రోవనడుచువాఁడు చెట్టునీడను, వర్షమువల్ల భయపడ్డ పురుషుఁడు స్వస్థముగా నుండెడు గృహమును, అభ్యాగత పురుషుఁడు గృహస్థుఁడును, దరిద్రుఁడు దాతను, అంధకారపీడితుఁడయినపురుషుఁడు దీపమును, చలిచేత వ్యాపింపబడ్డవాఁడు అగ్నిని, ఏ ప్రకారము పొందునో ఆ ప్రకారముగాను నీవు ఆ సాంబశివునియొక్క పాదపద్మములను పొందుమా యని తాత్పర్యము.

**శ్లో॥ అంకోలం నిజబీజసంతతిరయస్కాంతోపలం సూచికా**
**సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్ ।**
**ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవిందద్వయం**
**చేతోవృత్తిరుపేత్య తిష్ఠతి సదా సా భక్తిరిత్యుచ్యతే ॥ 61**

**టీక :** నిజబీజసంతతిః నిజ = స్వకీయమైన, బీజ = విత్తనములయొక్క, సంతతిః = సమూహము, అంకోలమ్ = ఊడుగవృక్షమును, యథా = ఏ ప్రకారమో, సూచికా = సూది, అయస్కాంతోపలమ్ = సూదంటురాతిని, యథా = ఏ ప్రకారమో, సాధ్వీ = పతివ్రతా స్త్రీ, నైజవిభుమ్ = స్వభర్తను, యథా = ఏ ప్రకారమో, స్వయమ్ = తానుగా, లతా = తీఁగె, క్షితిరుహమ్ = వృక్షమును, యథా = ఏ ప్రకారమో, సింధుః = నది, సరిద్వల్లభమ్ = సముద్రుని, యథా = ఏ ప్రకారమో, ఇహ = దీనియందు, ప్రాప్నోతి = పొందుచున్నదో, చేతోవృత్తిః : చేతః = మనస్సుయొక్క, వృత్తిః = వ్యాపారము, పశుపతేః = మహాదేవునియొక్క, పాదారవిందద్వయమ్ = చరణకమలయుగళమును, సదా=ఎల్లప్పుడును, తథా = ఆ ప్రకారముగాను, ఉపేత్య = పొంది, తిష్ఠతీతి యత్ = ఉంచున్నదనెడిది ఏది గలదో, సా = అది, భక్తిః = భక్తి అని, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది.

మ. **సతి యాత్మీయపతిన్, లతావితతి వృక్షం, బాత్మబీజంపు సం**
**తతి యంకోలము, నేళ్లపాంపతిని, వెంటన్ సూది సూదంటురా**
**సతమెబ్భంగిఁ బెనంగుఁ, దావకపదాబ్జాతంబులందున్ మనో**
**గతి యబ్భంగిఁబెనంగి యుండుటదియేకా భక్తి భక్తప్రియా!.**

**తా** : స్వకీయ బీజ సమూహము ఊడుగచెట్టును, సూది సూదంటురాతిని, పతివ్రతా స్త్రీ నిజపురుషుని, తీఁగె వృక్షమును, నది సముద్రమును, ఎట్లు పొందియుండునో అట్లు చేతో

వృత్తియు శ్రీమహాదేవునియొక్క చరణకమలయుగళమును ఎల్లప్పుడును పొందియుండుటయే అచంచలమైన భక్తి అని చెప్పఁబడుచున్నదని తాత్పర్యము.

**శ్లో॥ ఆనందాశ్రుభిరాతనోతి పులకం నైర్మల్యతశ్ఛాదనం**
**వాచాశంఖముఖే స్థితైశ్చ జఠరాపూర్తిం చరిత్రామృతైః ।**
**రుద్రాక్షైర్భసితేన దేవ! వపుషో రక్షాం భవద్భావనా-**
**పర్యంకే వినివేశ్య భక్తిజననీ భక్తార్భకం రక్షతి ॥ 62**

**టీక :** హే దేవ! = ఓయి మహాదేవుఁడా!, తవ = నీయొక్క, భక్తిజననీ : భక్తి = భక్తియనియెడు, జననీ = తల్లి, భక్తార్భకమ్ = భక్తుడనియెడు చిన్నవానిని, ఆనందాశ్రుభిః = సంతోష బాష్పజలములచేతను, పులకమ్ = గగుర్పాటు కలవానిగాను, ఆతనోతి = విస్తరింపజేయుచున్నది, నైర్మల్యతః = భక్తశిశునీష్ఠమైననిర్మలభావమువల్లనుండి, ఛాదనమ్=కప్పు వస్త్రమును, ఆతనోతి = విస్తరింపఁజేయుచున్నది, వాచా శంఖముఖస్థితైః : వాచా = వాక్కనెడు, శంఖ = శంఖముయొక్క, ముఖస్థితైః = ముఖమందున్నట్టి, చరిత్రామృతైః : చరిత్ర = చరిత్రలనియెడి, అమృతైః = పాలచేతను, జఠరాపూర్తిం : జఠర = ఉదరముయొక్క, పూర్తిమ్ = నిండించుటను, ఆతనోతి = విస్తరింపజేయుచున్నది, రుద్రాక్షైః = రుద్రాక్షలచేతను, భసితేన = భస్మముచేతను, వపుషః = శరీరముయొక్క, రక్షామ్ = రక్షను, ఆతనోతి = విస్తరింపఁజేయుచున్నది, భవద్భావనాపర్యంకే : భవత్ = నీయొక్క, భావనా = తలఁచుటయను, పర్యంకే = మంచమందు, వినివేశ్య = ఉంచి, రక్షతి = రక్షించుచున్నది.

సీ. పులకలువారనామూల మానందాశ్రు
పూరంబులను లాలఁ బోసి పోసి
కలుషంబులేని విజ్ఞానంబువలని మే
ల్తలిమంపుఁబొత్తులఁ దార్చి తార్చి
మొలక పల్కులగిన్ని యలతోడ నీకథా
పీయూషమున నుగ్గుఁ బెట్టి పెట్టి
కలయరిష్టములెల్లఁ దొలఁగ రుద్రాక్షలన్
బూదులన్ రక్షలు పూన్చి పూన్చి

గీ. అవిరతధ్యానమనెడు నుయ్యాలనునిచి
హాయిగా జోలపాడుచు నరసి యరసి
యేటఁబెంచెడువానిని? బూటఁబెంచు
భక్తుఁడును పిల్లవాని సద్భక్తిజనని.

**తా** : అనగా ఓయి మహాదేవుఁడా నీ భక్తి అనెడు తల్లి భక్తుఁడను అర్భకుని ఆనందాశ్రువులచేత గగుర్పాటుగలవాని గాను, నిర్మలభావమువల్ల వస్త్రము కప్పుకొన్నవానిగాను, వాక్కనెడు శంఖముచేత నీ చరిత్రములనెడు పాలుత్రాగినవానిగాను, రుద్రాక్ష విభూతుల చేత రక్షచేయఁబడినవానిగాను చేసి నీ ధ్యానమనెఁడు మంచమందు పవ్వళింపఁజేసి రక్షించుచున్నదని తాత్పర్యము.

**శ్లో॥ మార్గావర్తితపాదుకా పశుపతేరంగస్య కూర్చాయతే**
**గండూషాంబునిషేచనం పురరిపోర్దివ్యాభిషేచాయతే ।**
**కించిద్భక్షితమాంసశేషకబళం నవ్యోపహారాయతే**
**భక్తిః కిం న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే ॥ 63**

**టీక :** పశుపతేః = శివుని సంబంధమైన, అంగస్య = అవయవమునకు, మార్గావర్తిత పాదుకా : మార్గ = మార్గములయందు, ఆవర్తిత = అనుభూతమైనట్టి, పాదుకా = పాదరక్ష, కూర్చాయతే = భ్రూమధ్యస్థానమువలె ఆచరించుచున్నది, పురరిపోః = త్రిపురశత్రువైన ఈశ్వరసంబంధమైన, అంగస్య = శరీరమునకు, గండూషాంబు = పుక్కిలించిన యుదకముయొక్క, నిషేచనమ్ = తడుపుట, దివ్యాభిషేచాయతే = దివ్యాభిషేకమువలెనే ఆచరించుచున్నది, కించిద్భక్షితమాంసశేషకబళం : కించిత్ = కొంచెము, భక్షిత = భక్షింపబడిన, మాంస = మాంసముయొక్క, శేష = మిగిలినట్టి, కబళమ్ = కబళము, నవ్యోపహారాయతే : నవ్య = నూతనమయినట్టి, ఉపహారాయతే = నైవేద్య ద్రవ్యము వలెనే ఆచరించుచున్నది, వనచరః = బోయవాఁడు, భక్తావతంసాయతే = భక్తశ్రేష్ఠుఁడువలెనే ఆచరించుచున్నాఁడు, భక్తిః = భక్తి, కిమ్ = ఏమి , న కరోతి = చేయదు, అహో! = ఆశ్చర్యము.

**చ. పలుమఱు దారిఁద్రొక్కఁబడు పాదుకశూలికిఁగూర్చ, పుక్కిటన్**
**జెలఁగెడు నీర్పురారి కభిషేకజలం బరదిన్న నీచపుం**
**బలలలవం బుమాపతికిఁ బారణ కానఁ జరించుబోయ భ**
**క్తులకు వలంతియయ్యెఁ దుదకున్ దృఢభక్తికి సాటియున్నదే?**

**తా** : సాంబశివునియొక్క దేహమునకు మాటిమాటికిని త్రోవనడిచిన పాదరక్ష కనుబొమల నడిమి చోటుగా నాచరింపబడినది, త్రిపురాంతకుఁడైన శివుని దేహమునకు పుక్కిటి నీళ్ళభిషేకముగా నాచరింపఁబఁడినవి, ఇంచుక తినగా మిగిలిన నంజుడు వేడి వేడి నైవేద్యముగా నాచరింపఁబఁడినది, అడవిన దిరుగు బోయవాఁడు భక్తాగ్రగణ్యుండుగ నాచరింపఁబఁడినవాఁడు కాన భక్తియనునది యేమి చేయదు? ఎల్లపనులనుం జేయ

నేర్చునని తాత్పర్యము. ఒకానొక పరమభక్తుండిటు చేసి కైవల్యమును బొందెనని పురాణప్రసిద్ధి, ఇట్లు చెప్పుట చేత శివభక్తిగల పురుషుని పరమశివుఁడు పెక్కు విధములచే పరిశోధించి కైవల్యమిచ్చుచున్నాఁడని ముఖ్యతాత్పర్యము.

**శ్లో॥ వక్షస్తాడనమంతకస్య కఠినాపస్మారసంమర్దనం**
**భూభృత్పర్యటనం నమత్సురశిరఃకోటీరసంఘర్షణమ్ ।**
**కర్మేదం మృదులస్య తావకపదద్వంద్వస్య గౌరీపతే!**
**మచ్చేతోమణిపాదుకావిహరణం శంభో! సదాఽఙ్గీకురు ॥ 64**

**టీక :** అంతకస్య = యమధర్మరాజుయొక్క, వక్షస్తాడనం : వక్షః = రొమ్మునందు, తాడనమ్ = తన్నుటయు, కఠినాపస్మారసమ్మర్దనం : కఠినమయినట్టి, అపస్మార = అజ్ఞానముయొక్క సమ్మర్దనమ్ = నిగ్రహించుటయు, భూభృత్పర్యటనం : భూభృత్ = కైలాసపర్వతమందు, పర్యటనమ్ = సంచరించుటయు, నమత్సురశిరఃకోటీరసంఘర్షణం : నమత్ = నమ-స్కారములు చేయుచున్న, సుర = దేవతలయొక్క, శిరః = శిరస్సులయందలి, కోటీర = కిరీటములయందు, సంఘర్షణమ్ = ఒరయుటయు, హే గౌరీపతే! = ఓయి పార్వతీ మనోహరుఁడవయిన ఈశ్వరుఁడా, హే శంభో! = ఓయి సుఖకరుఁడవయిన మహాదేవుఁడా!, మృదులస్య = మార్దవయుక్తమయినట్టి, తావకపదద్వంద్వస్య = నీ సంబంధమైన పాద యుగళముయొక్క, కర్మ = వ్యాపారము, మచ్చేతోమణిపాదుకావిహరణం : మత్ = నా యొక్క, చేతః = మనస్సనియెడి, మణిపాదుకావిహరణమ్ = మణిమయపాదుకలయందు విహరించుటను, సదా = ఎల్లప్పుడు, అంగీకురు = అంగీకరించుమా.

**ఉ. ఘోరతమంబడంపఁ గఱకుం గిరికోనఁజరింప, దుంతబా**
**బారవుతున్ దిటంపుటెదపైఁ బడదన్న, నమత్సుపర్వకో**
**టీరపురాయిడిన్ నలిగెడిన్ గద నీమృదుపాదముల్ జగ**
**ద్భార మదీయచిత్తమణి పాదుకలందుఁజరింప రాదొకో.**

**తా :** అనగా సుఖకరుఁడవును పార్వతీభర్తవునైన యీశ్వరుఁడా యమధర్మరాజుయొక్క రొమ్ము తన్నుటయు, అజ్ఞానముయొక్క నిగ్రహించుటయు, కైలాసపర్వతమందు సంచరించు టయు, నమస్కరించుచుండెడు దేవతలయొక్క శిరస్సులయందలి కిరీటములయందు ఒరయుటయు గల అతిమృదువయిన నీపాదద్వంద్వముయొక్క కర్మ నామనస్సనెడి మణిమయ పాదుకలయందు విహరించుటగా అంగీకరించుమా!

**శ్లో॥ వక్షస్తాడనశంకయా విచలితో వైవస్వతో నిర్జరాః**
**కోటీరోజ్జ్వలరత్నదీపకలికానీరాజనం కుర్వతే ।**

**దృష్ట్వా ముక్తివధూస్తనోతి నిభృతాశ్లేషం భవానీపతే!**
**యచ్చేతస్తవ పాదపద్మభజనం తస్యేహ కిం దుర్లభమ్ ॥ 65**

**టీక :** హే భవానీపతే! = ఓయి పార్వతీమనోహరుఁడవయిన ఈశ్వరుఁడా!, యచ్చేతః : యత్ = ఏ పురుషునియొక్క, చేతః = చిత్తము, తవ = నీ యొక్క, పాదపద్మభజనం : పాదపద్మ = పద్మములవంటి పాదములయొక్క, భజనమ్ = సేవచేయునది, భవతి = అవుచున్నదో, తమ్ = వానినిచూచి, వైవస్వతః = యమధర్మరాజు, వక్షస్తాడనశంకయా : వక్షః = రొమ్ముయొక్క, తాడన = తన్నుటయొక్క, శంకయా : శంకచేతను, విచలితః = పలాయమానుఁడగుచున్నాఁడు, నిర్జరాః = దేవతలు, కోటీరోజ్జ్వలరత్నదీపకళికానీరాజనం : కోటీర = కిరీటములయందు, ఉజ్జ్వల = ప్రకాశించుచున్నట్టి, రత్నదీప = దీపముల వంటి రత్నములయొక్క, కళికా = అంకురములచేతను, నీరాజనమ్ = నివాళిని, కుర్వతే = చేయుచున్నారు, ముక్తివధూః = ముక్తికాంత, నిభృతాశ్లేషమ్ = గాఢాలింగనమును, తనోతి = చేయుచున్నది, తస్య = ఆ భక్తునికి, ఇహ = ఈ లోకమందు, దుర్లభమ్ = పొంద నశక్యమయినవస్తువు, కిమ్ = ఏమి యున్నది?

చ. **ఎదపయిఁ దన్నునంచు యముఁడింతట నంతట బాఱు, వేలుపుల్**
**గదిసి కిరీటరత్నకలితాతతి నారతులెత్తుచుంద్రు, తా**
**నెదురయి ముక్తికాంత దనియించును గాటపుఁగౌఁగిలింతలన్**
**మది భవదీయపాదములనాఁటినవానికి కేటిలోటిలన్.**

**తా** : అనగా ఓయి పార్వతీమనోహరుఁడవయిన ఈశ్వరుఁడా! ఎవనియొక్క చిత్తము నీపాదపద్మసేవయందు ఆసక్తమగుచున్నదో వానిని చూచి యముఁడు ముందునీవు రొమ్మున తన్నుటను తలంచి భయపడి దూరముగా పరుగెత్తి పోవుచున్నాఁడు. దేవతలు తమ కిరీటములయందు దీపములవలె నుండు రత్నములయొక్క అంకురములచేత నారతు లిచ్చుచున్నారు. ముక్తికాంత గాఢాలింగనము చేసికొనుచున్నది. గనుక ఆ భక్తునికి ఈ లోకమందు పొందనశక్యమైన వస్తువేదియు లేదు. సర్వమును స్వాధీనమయి యుండునని తాత్పర్యము.

శ్లో॥ **క్రీడార్థం సృజసి ప్రపంచమఖిలం క్రీడామృగాస్తే జనా**
**యత్కర్మాచరితం మయా చ భవతః ప్రీత్యై భవత్యేవ తత్ ।**
**శంభో! స్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం**
**తస్మాన్మామకరక్షణం పశుపతే! కర్తవ్యమేవ త్వయా ॥ 66**

**టీక :** హే శంభో! = ఓయి సుఖకరుఁడవయిన ఈశ్వరుఁడా!, అఖిలమ్ = సమస్తమయిన, ప్రపంచమ్ = లోకమును, క్రీడార్థమ్ = విలాసమే ప్రయోజనముగా గలుగునట్టుగాను,

సృజసి = సృజించుచున్నావు, తే = నీకు, జనాః = జనులు, క్రీడామృగాః = ఆటలాడుకొను మృగములగుచున్నారు, మయా = నాచేత, యత్కర్మచరితమ్ = ఏ ఏకర్మమాచరింపబడు చున్నదో, తత్ = ఆకర్మ, భవతః = నీయొక్క ప్రీత్యై = ప్రేమకొరకు, భవత్యేవ = అవుచున్నది, మచ్చేష్టితం : మత్ = నా యొక్క, చేష్టితమ్ = వ్యాపారము, స్వస్య = నీ యొక్క కుతూహలస్య = సంతోషమునకు, కరణమ్ = కారణము, భవతి = అవుచున్నది, తస్మాత్ = అందువల్ల, పశుపతే! = ఓయి సకలభూతములకున్ను అధిపతివైనవాఁడా!, మామకరక్షణమ్ = నా సంరక్షణము, త్వయా = నీచేత, కర్తవ్యమేవ = చేయతగ్గదే అగుచున్నది.

**శా. నీయాడించుమృగంబు లీజనులు తండ్రీ! లోకపుంజేత క్రీ**
**డాయత్నంబిఁక మాకృతంబులగు చేష్టల్ కర్మముల్గాని బా**
**గోయోగో యవి నీముదంబునకెగాదో యింకమాదో సమే**
**దో యేలామముఁబ్రోవకుండెదవు శంభూ! లోకరక్షా గురూ!**

**తా** : ఓయి ఈశ్వరుఁడా! సమస్తప్రపంచమును విలాసమే ప్రయోజనముగా సృజించు చున్నావు, నీకు నీజనులందఱు విలాసము కొరకు నిర్మింపబడ్డ మృగములవుచున్నారు. నాచేతయే యేకర్మ ఆచరింపబడుచున్నదో ఆకర్మ నీకు ప్రీతికొరకు అవుచున్నది. నా యొక్క చేష్ట నీసంబంధమయిన సంతోషమునకు కారణమవుచున్నది కాన సకలభూతములకును అధిపతివైన నీవే నన్ను సంరక్షింపవలసినవాఁడవు.

**శ్లో॥ బహువిధపరితోషబాష్పపూర-**
**స్ఫుటపులకాంకితచారుభోగభూమిమ్ ।**
**చిరపదఫలకాంక్షిసేవ్యమానాం**
**పరమసదాశివభావనాం ప్రపద్యే ॥ 67**

**టీక :** బహువిధపరితోషబాష్పపూరస్ఫుటపులకాంకితచారుభోగభూమిం : బహువిధ = అనేకవిధములైనట్టి, పరితోషబాష్ప = ఆనందాశ్రువులయొక్క, పూర = ప్రవాహ సంబంధమైన, స్ఫుట = వ్యక్తమయినటువంటి, పులకాంకిత = గగుర్పాటురూపమయిన, అంకిత = చిహ్నముగాచేయబడిన, చారు = మనోహరమైన, భోగభూమిమ్ = భోగస్థానమైనట్టి, చిర... సేవ్యమానాం : చిరపద = శాశ్వతకైలాసస్థానమనెడి, ఫల = ఫలములను, కాంక్షి = కోరుచుండెడివారలచేతను, సేవ్యమానామ్ = సేవింపబడుచున్నట్టి, పరమసదాశివభావనాం : పరమ =శ్రేష్ఠుఁడయినట్టి, సదాశివ = సాంబునియొక్క, భావనామ్ = ధ్యానమును, ప్రపద్యే = శరణు పొందుచున్నాను.

**మ. అమితానందసుధాశ్రుపూరపులకాంకారూఢభోగాది వి**
**శ్రమమై, శాశ్వతభాగధేయ ఫలకాంక్షాబద్ధ దీక్షామన**

స్కమునీట్సంతతసేవ్యమానమయి హింసారూపసంసార వి
భ్రమముంబాపెడు పార్వతీశ్వరపదాబ్జధ్యాన మాశించెదన్

**తా** : అనగా అనేకవిధములైనట్టి ఆనందాశ్రుప్రవాహసంబంధమయినట్టిన్ని, వ్యక్తమైన గగుర్పాటు రూపమైన భక్తిచిహ్నమనోహరమైన భోగభూమియైనట్టిన్ని, శాశ్వతకైలాసస్థానమును కోరెడివారలచేత సేవింపబడుచున్నట్టి శ్రేష్ఠుండయిన సదాశివునియొక్క ధ్యానమును శరణు పొందుచున్నాను. అనగా నన్ను రక్షించెడి కొరకు ధ్యానము చేయుచున్నానని తాత్పర్యము.

**శ్లో॥ అమితముదమృతం ముహుర్దుహంతీం**
**విమలభవత్పదగోష్ఠమావసంతీమ్ ।**
**సదయ! పశుపతే! సుపుణ్యపాకాం**
**మమ పరిపాలయ భక్తిధేనుమేకామ్ ॥ 68**

**టీక :** హే సదయ! = ఓయి దయతో కూడుకొన్నవాండా!, పశుపతే! = పశుపాలకుండా!, అమితముదమృతం : అమిత = అపరిచ్ఛిన్నమైనట్టి, ముదమృతమ్ = సంతోషమను పాలును, ముహుః = మాటిమాటికిని, దుహంతీమ్ = పిండుచుండునదియు, విమలభవత్పదగోష్ఠం : విమల = నిర్మలమయినట్టి, భవత్పద = నీయొక్క పాదములను, గోష్ఠమ్ = దొడ్డిపట్టును గూర్చి, ఆవసంతి = నివాసముగా నుండునదియు, సుపుణ్యపాకామ్ = విమల పుణ్య ఫలభూతమయినదియు నగు, మమ = నాయొక్క, భక్తిధేనుం : భక్తి = భక్తియనియెడు, ధేనుమ్ = గోవును, ఏకామ్ = ఒక్కటిని, పరిపాలయ = రక్షించుమా

**కం. వితత ముదమృదముఁబితుకు, సు**
**కృతఫలమున సంవసించు, నీశ! త్వదీయాం**
**చితపాదగోష్ఠమున, బశు**
**పతి! మద్భక్తియనుగోవుఁ బాలింపు దయన్.**

**తా** : అనగా దయతోగూడుకొన్న పశుపతివైన ఈశ్వరుండా! అపరిమితమైన సంతోషమను పాలును మాటిమాటికి నిచ్చునదియు, నిర్మలమయిన నీపాదములను దొడ్డియందుండు నదియు, పుణ్యఫలభూతమయినట్టి నాయొక్క భక్తియను ధేనువును ఒక్క దానిని రక్షించుమా అనగా లోకములో నొకండు పాలిచ్చు నావును తాను కాపాడ చాలక కాపాడతగిన పురుషుని స్వాధీనమెట్లు చేయునో అటువలెనని తాత్పర్యము.

**శ్లో॥ జడతా పశుతా కళంకితా**
**కుటిలచరత్వం చ నాస్తి మయి దేవ! ।**
**అస్తి యది రాజమౌళే!**
**భవదాభరణస్య నాస్మి కిం పాత్రమ్ ॥ 69**

**టీక :** జడతా = మూఢత్వమున్ను, జలాత్మత్వమున్ను, పశుతా = పశుత్వమున్ను, కళంకితా = కళంకత్వమున్ను, కుటిలచరత్వం చ = కుటిలభావమున సంచరించుటయు, చంద్రుని యందున్నవి, మయి = నాయందు, నాస్తి = లేవు, హే దేవా! = ఓయి మహాదేవుఁడా!, హే రాజమౌళే! = ఓయి చంద్రుని శిరస్సునందు భూషణముగా ధరియించి యుండెడువాఁడా!, అస్తియది = నాయందున్నట్టులయిన, భవదాభరణస్య : భవత్ = నీయొక్క, ఆభరణస్య = ఆభరణమునకు, పాత్రమ్ = పాత్రమయినవాఁడను, నాస్మి కిమ్ = కానివాఁడనగు చున్నానా యేమి?

**కం.** **లేదు జడత్వము, కుటిలత**
**లేదు కళంకితయు లేదు, లేదు పశుతయున్**
**నాదెసఁ గాదన నీభూ**
**షాదులకున్ రాజమౌళి! యర్హుఁడఁగానే.**

**తా** : జడత్వమున్ను పశుత్వమున్ను కళంకిత్వమున్ను కుటిలత్వమున్ను యివి చంద్రుని యందున్నవి. అట్టి చంద్రుని భూషణముగా శిరస్సున ధరించియున్నావు. నాయందు ఈ స్వభావము లేమియు లేవు. ఒకవేళ నున్నట్టులయిన ఓయి మహాదేవుఁడా! చంద్రుని శిరస్సునందు ధరించియుండెడువాఁడా! నీకు భూషణమవుటకు పాత్రుఁడను కానాయేమి అని తాత్పర్యము.

**శ్లో॥** **అరహసి రహసి స్వతంత్రబుద్ధ్యా**
**వరివసితుం సులభః ప్రసన్నమూర్తిః ।**
**అగణితఫలదాయకః ప్రభుర్మే**
**జగదధికో హృదిరాజశేఖరోఽస్తి ॥** **70**

**టీక :** ప్రసన్నమూర్తిః = ప్రసాదోన్ముఖమయిన స్వరూపము కలిగినట్టిన్ని, అగణితఫలదాయకః : అగణిత = అసంఖ్యాకమయినట్టి, ఫల = మనోవాంఛాఫలమునకు, దాయకః = ప్రదాత అయినట్టిన్ని, ప్రభుః = సృష్టికర్త అయినటువంటిన్ని, జగదధికః = జగత్తుల కధికుఁడయినటు వంటిన్ని, రాజశేఖరః = చంద్రుని శిరస్సునందు ధరించియున్నట్టి ఈశ్వరుఁడు, (రాజశేఖరః = సార్వభౌముఁడనియు నర్థమౌచున్నది), మమ = నాయొక్క, హృది = మనస్సునందు, అస్తి = కలఁడు, అరహసి = బహిః ప్రదేశమందున్ను, రహసి = అంతఃకరణమందున్ను, స్వతంత్రబుద్ధ్యా = స్వాయత్తమయిన బుద్ధిచేతను, వరివసితుమ్ = పరిచర్య చేయుటకై, సులభః = సులభుఁడయినవాఁడు, భవతి = అవుచున్నాఁడు.

**మ.** **బహిరంతఃకరణస్వతంత్రమతి, సంభావించి కొల్వన్ ము**
**ర్మహరానంద రసప్రసన్న కరుణాస్ఫూర్తి స్ఫురన్మూర్తి యై**

మహనీయుండగు రాజమౌళి, త్రిజగన్మాన్యుం డభీష్టక్రియా
వహుండై నామది ప్రత్యహం బునికిసల్పన్ జింతనాకేమిఁకన్.

**తా** : ప్రసాదోన్ముఖమయిన స్వరూపము కలిగినట్టిన్ని, అసంఖ్యాతములయిన మనోవాంఛా ఫలదాయకుఁడయినట్టిన్ని, సృష్టికర్త అయినట్టిన్ని, జగత్తులకధికుఁడు అయినట్టిన్ని, చంద్రుని శిరస్సునందు ధరించియున్నట్టి ఈశ్వరుఁడు, నాయొక్క మనస్సునందు కలఁడు, బహిః ప్రదేశమందున్ను అంతఃకరణమందున్ను స్వాయత్తమైన బుద్ధిచేతను పరిచర్య చేయుటకు సులభుఁడైనవాఁడు అగుచున్నాఁడు అని తాత్పర్యము.

ఈ శ్లోకమొక రాజపర్యాయముగా గూడ నర్థమగుచున్నది.

**శ్లో॥ ఆరూఢభక్తిగుణకుంచితభావచాప-**
**యుక్తైః శివస్మరణబాణగణైరమోఘైః ।**
**నిర్జిత్య కిల్బిషరిపూన్విజయీ సుధీంద్ర-**
**స్సానందమావహతి సుస్థిరరాజలక్ష్మీమ్ ॥ 71**

**టీక** : సుధీంద్రః = బుద్ధిమంతుఁడు, ఆరూఢభక్తిగుణకుంచితభావచాపయుక్తైః : ఆరూఢ = దిట్టముగ వ్యాపించినట్టి, భక్తి = భక్తి అనెడు, గుణ = అల్లెత్రాటిచేత, కుంచిత = వంచబడ్డట్టి, భావ = భావమనెడు, చాప = ధనస్సునందు, యుక్తైః = కూర్చబడ్డట్టిన్ని, అమోఘైః = విఫలములు కానట్టి, శివస్మరణబాణగణైః : శివ = ఈశ్వరునియొక్క, స్మరణ = స్మరణములనెడు, బాణగణైః = బాణసమూహములచేతను, కిల్బిషరిపూన్ : కిల్బిష = పాపములనెడు, రిపూన్ = శత్రువులను, నిర్జిత్య = నిశ్శేషముగా జయించి, విజయీ = జయము కలవాఁడగుచు, సానందమ్ = ఆనందముతో కూడుకొన్నట్టుగాను, సుస్థిర రాజలక్ష్మీమ్ : సుస్థిర = సుస్థిరులయిన బ్రహ్మాదులకు, రాజ = ప్రభువయిన పరమశివునియొక్క, లక్ష్మీమ్ = సారూప్యలక్ష్మిని, ఆవహతి = పొందుచున్నాఁడు.

**గీ. భావమనువింట నారూఢభక్తి గుణము**
**మోపి పరశివచింతినామోఘశరము**
**లేసి, కిల్బిషరిపుల జయించి సుమతి**
**ప్రమదమునఁగాంచు సుస్థిరరాజలక్ష్మి.**

**తా** : అనగా లోకమందు నొకానొక రాజు బాణముల చేతను, సకల శత్రువులను జయించి, శత్రురాజలక్ష్మిని యెట్లు పొందుచున్నాఁడో ఆ ప్రకారము భక్తుఁడయినవాఁడు భక్తి పూర్వకమయిన శివస్మరణములచేతను పాపములను నశింపఁజేసి శివసాయుజ్యమందు చున్నాఁడని ముఖ్య తాత్పర్యము.

**శ్లో॥ ధ్యానాంజనేన సమవేక్ష్య తమఃప్రదేశం**
**భిత్త్వా మహాబలిభిరీశ్వరనామమంత్రైః ।**
**దివ్యాశ్రితం భుజగభూషణముద్వహంతి**
**యే పాదపద్మమిహ తే శివ! కృతార్థాః ॥ 72**

**టీక :** హే శివ! = ఓయి సాంబశివుఁడా!, ధ్యానాంజనేన : ధ్యాన = ధ్యానమనెడు, అంజనేన = కాటుకచేతను, సమవేక్ష్య = ఈశ్వరపదపద్మరూపవస్తువును లెస్సగా చూచి, ఈశ్వరనామమంత్రైః : ఈశ్వర = సాంబశివునియొక్క, నామ = పేర్లనెడి, మంత్రైః = మంత్రములచేతననెడి, బలిభిః = బలులచేతను, తమః ప్రదేశమ్ = అజ్ఞానమనే ప్రదేశమును, భిత్త్వా = భేదించి, యే = యే భక్తులు, దివ్యాశ్రితం : దివ్యా = దేవతలచేతను, ఆశ్రితమ్ = పొందబడ్డటువంటి, భుజగభూషణం : భుజగ = సర్పము, భూషణమ్ = భూషణముగా కలిగినటువంటి, తే = నీ యొక్క, పాదపద్మమ్ = పాదకమలమును, ఇహ = యీ జన్మమందు, ఉద్వహంతి = వహించుచున్నారో, తే = ఆ భక్తులు, కృతార్థాః = జన్మ సఫలత్వమును బొందిన వారగుచున్నారు.

**మ. వనితధ్యానమహాంజనంబునఁ, దమోవాటిం బ్రపాటించి యా**
**త్మనిరూఢిన్ భవదీయనామజపమంత్ర శ్రీబలింగూర్చి ది**
**వ్యనిషేవ్యంబు, భుజంగభూషణమునౌ భావత్క పాదారవిం**
**ద నిధానంబునుజూఁడగొన్నతఁడెకా ధన్యుం డుమానాయకా!.**

**తా :** అనగా లోకమందునొక పురుషుఁడు, ధనాంజనమును నేత్రమునకు వేసికొని ధనమును పాతిన ప్రదేశమును తెలుసుకొని, బలులు మొదలయిన వానిచేతను, ఆ నిక్షేప రక్షక దేవతలను స్వాధీనపరుచుకొని, ఆ నిక్షేపప్రదేశమును భేదించి నిధిని పొంది సంతోషమును నెట్లనుభవించునో అటువలెనే భక్తులున్ను ధ్యానాద్యుపాయములచేతను ఆ పరమశివునియొక్క పాదారవిందమును సాక్షాత్కారము చేసుకొని, అన్యులకు సులభము కానట్టి ఆ ఆనందమును అనుభవించుచున్నాఁడని తాత్పర్యము.

**శ్లో॥ భూదారతాముదవహత్యదపేక్షయా శ్రీ-**
**భూదార ఏవ కిమతస్సుమతే! లభస్వ ।**
**కేదారమాకలితముక్తిమహౌషధీనాం**
**పాదారవిందభజనం పరమేశ్వరస్య ॥ 73**

**టీక :** హే సుమతే! = ఓయి మంచిబుద్ధి గలిగినవాఁడా!, యదపేక్షయా = ఏ పాదారవింద దర్శనాపేక్షచేతను, శ్రీభూదార ఏవ = లక్ష్మీభూములు భార్యలుగా గలిగిన విష్ణుదేవుఁడే, భూదారతామ్ = వరాహభావమును, ఉదవహత్ = వహించినవాఁడాయెను, కిమ్ =

ఏమి, అతః = అందువల్లనుంచి, ఆకలితముక్తిమహౌషధీనాం : ఆకలితః = చెప్పుచునుండెడి, ముక్తి = సాలోక్యాది చతుర్విధ ముక్తులనెడి, మహౌషధీనామ్ = ఓషధులకు, కేదారమ్ = ఉత్పత్తి స్థానమయిన, పరమేశ్వరస్య = సాంబశివునియొక్క, పాదారవిందభజనం : పాదారవింద = పాదకమలములయొక్క, భజనమ్ = సేవను, లభస్వ = పొందుము.

గీ. ముక్తియనుమేటి సంజీవి మొలచునట్టి
శ్రీమహేశుపదంబు దర్శింపఁ గోరి
శ్రీహరి వరాహమయ్యె నాయూహతోనె
నిరతము భజింపుమా జగద్గురుని సుమతి.

**తా** : ఏ కారణముచేత శ్రీమహావిష్ణువే తన అభిలాషను పూర్తిచేసుకొనుటకై వరాహమై శివపాదారవింద దర్శనమును కోరినవాఁడాయెనో అటువంటి శివభజనమును నీవును చేయుమోయి మంచిబుద్ధిగలవాఁడా యని తాత్పర్యము.

**శ్లో॥ ఆశాపాశక్లేశదుర్వాసనాది-
భేదోద్యుక్తైర్దివ్యగంధైరమందైః ।
ఆశాశాటీకస్య పాదారవిందం
చేతఃపేటీం వాసితాం మే తనోతి ॥ 74**

**టీక :** ఆశాశాటీకస్య : ఆశా = దిక్కు, శాటీకస్య = అంబరముగా గలిగిన ఈశ్వరుని యొక్క, పాదారవిందమ్ = పాదపద్మము, మే = నాయొక్క, చేతఃపేటీం : చేతః = చిత్తమనెడు, పేటీమ్ = పెట్టెను, ఆశా... భేదోద్యుక్తైః : ఆశాపాశ = రజ్జువులవంటి ఆశలనెడి, క్లేశ = దుఃఖములను, దుర్వాసనాది=దుర్గంధములు మొదలయిన వానిని, భేద = భేదించుటయందు, ఉద్యుక్తైః = వృత్తములైనటువంటిన్ని, దివ్యగంధైరమందైః = దేవయోగ్యపరిమళముల చేతను, వాసితామ్ = వాసనగలిగినదిగా చేయబడ్డదిగాను, తనోతి = విస్తరింపఁజేయు చున్నది.

కం. ఆశాశాటీకాంఘ్రికు
శేశయము మదాత్మపేటి, జేరిన యాశా
పాశక్లేశకదుర్గం
ధాశయముం బాపి దివ్యమౌ గంధమిడున్.

**తా** : దిగంబరుఁడయిన సాంబమూర్తియొక్క పాదారవిందము నా మనస్సనియెడి పెట్టెను తాళ్ళవంటి ఆశలనెడి దుఃఖదుర్వాసనలను పోగొట్టు చుండునటువంటిన్ని దివ్యము లయినటువంటి విస్తారములయిన పరిమళములచేతను పుట్టింపబడిన వాసనకలిగిన దానిగాను జేయుచున్నది, అనగా మహేశ్వరునియొక్క పాదారవిందములు నామనస్సు నందెల్లప్పుడు నుండుగాక యని ముఖ్యతాత్పర్యము.

**శ్లో॥ కల్యాణినం సరసచిత్రగతిం సవేగం**
**సర్వేంగితజ్ఞమనఘం ధ్రువలక్షణాఢ్యమ్ ।**
**చేతస్తురంగమధిరుహ్యా చర స్మరారే!**
**నేతస్సమస్తజగతాం వృషభాధిరూఢ! ॥ 75**

**టీక :** హే వృషభాధిరూఢ! = వృషభమెక్కియుండెడువాఁడా!, సమస్తజగతామ్ = సకల లోకములకును, నేతః! = ప్రభువైనవాఁడా!, స్మరారే! = మన్మథునికి శత్రువైనవాఁడా!, కల్యాణినమ్ = శుభలక్షణయుక్తమయినదియు, సరసచిత్రగతిం : సరస = అనురాగముతోఁ గూడుకొన్నటువంటి, చిత్ర = నానావిధములైన, గతిమ్ = ఆస్కందితాది గమనములు గలిగినదియు, సవేగమ్ = వేగముతోఁ గూడుకొన్నదియు, సర్వేంగితజ్ఞమ్ = సర్వాంతర్భావము లను దెలిసినదియు, అనఘమ్ = నిర్దోషమైనదియు, ధ్రువలక్షణాఢ్యమ్ = రేఖారూపావర్తనాది శుభలక్షణసహితమైనదియునగు, చేతస్తురంగం : చేతః = మనస్సనియెడు, తురంగమ్ = గుఱ్ఱమును, అధిరుహ్య = యెక్కి, చర = సంచరించుమా.

**గీ. సకలభావజ్ఞ, మనఘము, సజవము, ధ్రువ**
**లక్షణాఢ్యంబు, కల్యాణి, లలితచిత్ర**
**యానమును, నైన నా మనోహయముకంటె**
**నీకు ముదిగొడ్డు ప్రియమయ్యెనే మహేశ?.**

**తా :** అనగా ఓ వృషభతురంగా, సర్వలక్షణయుక్తమైన నా మనస్సనియెడు గుఱ్ఱముపైనెక్కి సంచరింపుము అని తాత్పర్యము.

**శ్లో॥ భక్తిర్మహేశపదపుష్కరమావసంతీ**
**కాదంబినీవ కురుతే పరితోషవర్షమ్ ।**
**సంపూరితో భవతి యస్య మనస్తటాక-**
**స్తజ్జన్మసస్యమఖిలం సఫలం చ నాన్యత్ ॥ 76**

**టీక :** భక్తిః = సేవ, మహేశపదపుష్కరం : మహేశ = సాంబశివునియొక్క, పదపుష్కరమ్ = చరణాకాశమును, ఆవసంతీ = అంతటనావరించి, కాదంబినీవ = మేఘమాలికవలెనే, పరితోషవర్షమ్ = ఆనందవృష్టిని, కురుతే = చేయుచున్నది, యస్య = ఏ పురుషునియొక్క, మనస్తటాకః : మనః = మనస్సనెడి, తటాకః = మడుగు, సంపూరితః = నిండింపఁబడ్డది, భవతి = అగుచున్నదో, తజ్జన్మసస్యం : తత్ = ఆ పురుషునియొక్క, జన్మ = ఉత్పత్తియనెడు, సస్యమ్ = పయిరు, అఖిలమ్ = నిశ్శేషమగునట్లుగాను, సఫలం చ = ఫలవంతమైనది, భవతి = అగుచున్నదో, అన్యత్ = తదితర జన్మసస్యము, న సఫలం భవతి = సఫలమయినది కాదు.

గీ. భవునిపదపుష్కరముఁజెంది భక్తిమేఘ
పఙ్క్తి గురిసెడు పరితోషవర్షమెవని
మానసతటాకమును నింపు వానిజన్మ
సస్యమఖిలంబు సఫలంబు సంస్తుతంబు.

**తా** : అనగా నెవనియొక్క మనస్సు ఈశ్వరపాదభక్తిపూరితమై యుండునో వాని జన్మము సార్థకము అని తాత్పర్యము.

**శ్లో॥** బుద్ధిః స్థిరా భవితుమీశ్వర పాదపద్మ-
సక్తా వధూర్విరహిణీవ సదా స్మరంతీ ।
సద్భావనాస్మరణదర్శనకీర్తనాది
సమ్మోహితేవ శివమంత్రజపేన వింతే ॥ **77**

**టీక** : హే ఈశ్వర! = ఓయి యీశ్వరుఁడా!, విరహిణీ = భర్తనుండి వియోగమును పొందిన, వధూరివ = భార్యవలెనే, పాదపద్మసక్తా = నీ పాదపద్మమందు ఆసక్తమయి యున్నది కావుననే, సదా = ఎల్లప్పుడును, స్మరంతీ = ధ్యానము చేయుచున్నట్టి, బుద్ధిః = బుద్ధి, శివమంత్రజపేన = శివుఁడను మంత్రముయొక్క, జపేన = ఆవృత్తిచేతను, సంమోహితేవ = మోహమునే పొందినదానివలెను, స్థిరా = స్థిరమయినది, భవితుమ్ = అగుటకొరకు, సద్భావనాస్మరణదర్శనకీర్తనాది : సత్ = సత్యమయిన పాదపద్మముయొక్క, భావనా = ధ్యానముచేయుటయు, స్మరణ = స్మరించుటయు, దర్శన = చూచుటయు, కీర్తనాది = కీర్తనము చేయుటయు మొదలయిన వానిని గూర్చి, వింతే = విచారపడుచున్నది.

ఉ. అమలభవత్పదాంబురుహమందె తగుల్కొని నాదుబుద్ధి ని
న్నె మది స్మరించుచున్ విరహిణీసతి కైవడి నీదునామమం
త్రము జపియించి, మోహపరతన్ స్థిరతన్ గనఁజింతఁజేయ, ని
త్యముఁ దలపోయఁ, జూడఁగ, సదా నిను బాడఁదలంచు నీశ్వరా!.

**తా** : అనగా, ఓ మహేశ్వరా! భర్తృవియోగమును బొందిన భార్యవలె, నిత్యము నిన్ను గుఱించి నా మనంబు స్మరించుచుఁ బరవశత్వముఁజెందుచున్నఁదని తాత్పర్యము.

**శ్లో॥** సదుపచారవిధిష్వనుబోధితాం
సవినయాం సుహృదం సముపాశ్రితామ్ ।
మమ సముద్ధర బుద్ధిమిమాం ప్రభో!
వరగుణేన నవోఢవధూమివ ॥ **78**

**టీక** : హే ప్రభో! = సర్వార్థఘటనసమర్థ!, సదుపచారవిధిషు : సత్ = శ్రేష్ఠమైన,

నీపాదపద్మవముయొక్క, ఉపచారవిధిషు = పూజావిధానములయందు, అనుబోధితామ్ = శిక్షింపబడినదియు, సవినయామ్ = వినయముతోఁ గూడుకొని యుండునదియు, సుహృదమ్ = మంచిమనస్సును, సముపాశ్రితామ్ = ఆశ్రయించి యున్నదియునగు, మమ = నాయొక్క, ఇమామ్ = ఈ, బుద్ధిమ్ = బుద్ధిని, వరగుణేన = శ్రేష్ఠగుణోపదేశముచేతను, నవోఢవధూమివ = నూతనముగా వివాహమయిన భార్యను వలె, సముద్ధర = ఉద్ధరించుమా.

గీ. సముచితోపచారంబుల జాడఁగఱపి
వినయ మెఱిగించి, సన్మనోవృత్తి నెఱపి
మేలిగుణమిచ్చి, క్రొత్త యిల్లాలివలెను
దిద్దికొనుమయ్య, నాదుబుద్ధిం బరేశ!.

**తా** : అనగా ఓ ఈశ్వరా! నాబుద్ధికి భక్తివినయాది గుణములఁబ్రసాదించి రక్షింపుమని తాత్పర్యము.

**శ్లో॥ నిత్యం యోగిమనస్సరోజదళసంచారక్షమస్త్వత్క్రమ-**
**శ్శంభో! తేన కథం కఠోరయమరాడ్వక్షఃకవాటక్షతిః ।**
**అత్యంతం మృదులం త్వదంఘ్రియుగళం హా మే మనశ్చింతయ-**
**త్యేతల్లోచనగోచరం కురు విభో! హస్తేన సంవాహయే ॥ 78**

**టీక** : హే శంభో! = ఓయి సుఖకరుఁడవయిన ఈశ్వరుఁడా!, త్వత్క్రమః : త్వత్ = నీయొక్క, క్రమః = పదవిన్యాసము, నిత్యమ్ = ఎల్లప్పుడున్ను, యోగిమనస్సరోజదళ సంచారక్షమః : యోగి = యోగీశ్వరులయొక్క, మనః = మనస్సనెడి, సరోజ = పద్మముయొక్క, దళ = రేకులతోడను, సంచార = కూడుటయందు, క్షమః = సమర్థమైనది, తేన = ఆ మృదువైన పాదముచేతను, కఠోరయమరాడ్వక్షఃకవాటక్షతిః : కఠోర = కఠినమైనట్టి, యమరాట్ = యమధర్మరాజుయొక్క, వక్షఃకవాట = తలుపువంటి రొమ్ముయొక్క, క్షతిః : తన్నుటను, కథమ్ = ఎట్టుగాను, అత్యంతమ్ = మిక్కిలి, మృదులమ్ = మృదువైన, త్వదంఘ్రి యుగళమ్ = నీపాదయుగళమునుగూర్చి, మే = నా యొక్క, మనః = మనస్సు, చింతయతి = చింతిల్లుచున్నది, హా! = కష్టము, హే విభో! = ఓయి ప్రభువైన ఈశ్వరుఁడా!, ఏతత్ = యీ పాదయుగళమును, మే = నా యొక్క, లోచనగోచరం : లోచన = నేత్రములకు, గోచరమ్ = అగుపడుదానినిగా, కురు = చేయుమా, తత్ = ఆ పాదకమలమును, హస్తేన = హస్తముచేతను, సంవాహయే = వహించుచున్నాను.

గీ. పరమయోగి మనఃపద్మవాటిఁదిరుగు
మృదులమృదులంబులైన నీపదములీశ!

**కటుకఠోరయమేశ వక్షఃకవాట**
**పాటనకు నెంతనొచ్చెనో పట్టనిమ్ము.**

**తా** : అనగా, ఓయీశ్వరా! పరమయోగీశ్వరుల హృదయకమలములయందే సంచరించు నీమృదుపదములు కఠినమైన యమునివక్షస్స్థలమును దన్నుటయందు నొచ్చినదేమో కొంచెము పట్టెదను అనుగ్రహింపుము అని తాత్పర్యము.

**శ్లో॥ ఏష్యత్యేష జనిం మనో௨స్య కఠినం తస్మిన్నటానీతి మ-**
**ద్రక్షాయై గిరిసీమ్ని కోమలపదన్యాసః పురాభ్యాసితః ।**
**నోచేద్దివ్యగృహాంతరేషు సుమనస్తల్పేషు వేద్యాదిషు**
**ప్రాయస్సత్సు శిలాతలేషు నటనం శంభో! కిమర్థం తవ ॥ 80**

**టీక :** హే శంభో! = ఓయి సుఖకరుఁడవైన యీశ్వరుఁడా!, ఏషః = యీ జనుఁడు, జనిమ్ = ఉత్పత్తిని, ఏష్యతి = పొందఁబోవుచున్నాఁడు, అస్య = యీ జనియొక్క, మనః = మనస్సు, కఠినమ్ = కఠోరమయినది, తస్మిన్ = ఆ మనస్సునందు, నటానీతి = సంచారింపఁబోవుచున్నానను హేతువుచేతను, మద్రాక్షాయై = నాయొక్క రక్షణము కొరకు, కోమలపదన్యాసః : కోమల = మృదులమయినటువంటి, పద = పాదములయొక్క, న్యాసః = ఉంచుటను, గిరి సీమ్ని = పర్వతమధ్య ప్రదేశమందు, పురా = నా జననమునకు ముందు, అభ్యాసితః = అభ్యసింపఁబడ్డది, నోచేత్ = అటుగాకపోయినచో, దివ్యగృహాంతరేషు : దివ్య = రమణీయములయిన, గృహాంతరేషు = గృహమధ్యప్రదేశముల యందు, సుమనస్తల్పేషు = పుష్పశయ్యలయందు, వేద్యాదిషు = అరుగులు మొదలైన ప్రదేశముల యందు, ప్రాయః = క్రమముగాను, సత్సు = శ్రేష్ఠములైన, శిలాతలేషు = పాషాణ ప్రదేశములయందు, తవ = నీయొక్క, నటనమ్ = నాట్యము, కిమర్థమ్ = ఎందుకొరకు.

**మ. జనియించున్ ధర వీఁడు, వీనిమది పాషాణంబు నే నందునుం**
**డనగుంగా యని, నీదు కోమలపదన్యాసంబు నాకైశిలా**
**ద్రిని నభ్యాసముఁజేసియుందు వటుగాదేన్ సౌధముల్ లేవె మేల్**
**ననపాన్పుల్ కఱవే గిరీశ! మఱియేలా శైలసంచారముల్.**

**తా** : అనగా, ఓ గిరీశ! నాయందనుగ్రహముచే నామనంబు కఠినపాషాణప్రాయమైనను నందే సంచరించుటకు, నాజననమునకు ముందే నీ మృదుపదములను కొండరాలపైఁ దిరుగుట యందలవాటు పఱచినావని తాత్పర్యము.

**శ్లో॥ కంచిత్కాలముమామహేశ! భవతః పాదారవిందార్చనైః**
**కంచిద్ధ్యానసమాధిభిశ్చ నతిభిః కంచిత్కథాకర్ణనైః ।**

**కంచిత్కంచిదవేక్షణైశ్చ నుతిభిః కంచిద్దశామీదృశీం**
**యః ప్రాప్నోతి ముదా త్వదర్పితమనా జీవన్ స ముక్తః ఖలు ॥ 81**

**టీక :** హే ఉమామహేశ! = ఓయి పార్వతితోఁ గూడియుండెడు యీశ్వరుఁడా!, కంచిత్ = కొంచెమయినటువంటి, కాలమ్ = కాలమును, భవతః = నీయొక్క, పాదారవిందార్చనైః : పాదారవింద = కమలములవంటి పాదములయొక్క, అర్చనైః = పూజలచేతను, కంచిత్కాలమ్=కొంచెము కాలము, ధ్యానసమాధిభిః : ధ్యాన=ఎల్లప్పుదును నిన్ను చింతించుట యొక్క, సమాధిభిః = నియమముచేతను, కంచిత్కాలమ్ = కొంతకాలమును, నతిభిః = నమస్కారముల చేతనున్ను, కంచిత్కాలమ్ = కొంతకాలమును, కథాకర్ణనైః = నీ సంబంధ మయిన కథలు వినుటచేతనున్ను, కంచిత్కాలమ్ = కొంతకాలమును, ఆవేక్షణైః = చూచుట చేతనున్ను, కంచిత్కాలమ్ = కొంతకాలమును, నుతిభిః= స్తోత్రములచేతనున్ను, సహితః= కూడుకొన్నవాఁడై, ముదా = సంతోషము చేతను, త్వదర్పితమనాః : త్వత్ = నీయందు, అర్పిత=ఉంచబడ్డ, మనాః=చిత్తముగలిగినట్టి, యః=ఎవడు, ఈదృశీమ్=ఈ పూర్వోక్త మయినటువంటి, దశామ్ = స్థితిని, ప్రాప్నోతి = పొందుచున్నాఁడో, సః = ఆ పురుషుఁడు, జీవన్ సన్ = జీవించియున్నవాఁడైనను, ముక్తః ఖలు = ముక్తుఁడయినవాఁడు గదా.

మ. పరమానందముతో భవచ్చరణసేవం గొంతఁ, గొసంత నీ
స్మరణన్, నీనుతులన్ రవంతయు, నమస్కారంబులన్ సుంత, నీ
చరితంబుల్ వినఁగొంచెమించుక దిదృక్షాదీక్ష, నెవ్వాఁడు త్వ
త్పరుఁడై కాలముఁబుచ్చునో యతఁడు, జీవన్ముక్తుఁడార్యాపతీ!.

**తా :** అనగా, ఎవఁడు తన జీవితకాలములోఁ గొంతయైన నీశ్వరపాదార్చనాది విధులయందు నుపయోగపఱచుచు మనస్సు తదధీనము చేయుచున్నాఁడో యతఁడు జీవన్ముకుఁడని తాత్పర్యము.

**శ్లో॥ బాణత్వం వృషభత్వమర్థవపుషా భార్యాత్వమార్యాపతే!**
**ఘోణిత్వం సఖితా మృదంగవహతా చేత్యాదిరూపం దధౌ ।**
**త్వత్పాదే నయనార్పణం చ కృతవాన్ త్వద్దేహభాగో హరిః**
**పూజ్యాత్పూజ్యతరస్స ఏవ హి న చేత్కో వా తదన్యోధికః ॥ 82**

**టీక :** హే ఆర్యాపతే! = ఓయి పార్వతీపతియైన ఈశ్వరుఁడా!, హరిః = విష్ణువు, యస్మాత్కారణాత్ = ఏ కారణమువలన, బాణత్వమ్ = బాణమవుటయు, వృషఁభత్వమ్ = వృషభవాహన భావమును, అర్ధవపుషా = సగము శరీరముచేతను, భార్యాత్వమ్ = కళత్రభావమును, ఘోణిత్వమ్ = వరాహభావమును, సఖితా = స్నేహభావమును,

మృదంగవహతా = మృదంగమను వాద్యవిశేషమును వహించుటయు, ఇత్యాది = ఇది మొదలయిన, రూపమ్ = రూపమును, దధౌ = ధరించినవాఁడాయెనో, త్వత్పాదే : త్వత్ = నీ యొక్క, దేహ = దేహముయొక్క, భాగః = భాగము కలిగినవాఁడును, అయ్యెనో. తస్మాత్ = అందువల్ల, స ఏవ = ఆ విష్ణువే, పూజ్యాత్ = పూజన చేయతగిన బ్రహ్మాదుల కంటెను, పూజ్యతరః = మిక్కిలి పూజచేయతగినవాఁడు, అభవత్ = అయ్యెను, న చేత్ = అటుగాకపోయినచో, తదన్యః = ఆ విష్ణువు కంటె అన్యుఁడు, అధికః = అధికుఁడయినవాఁడు, కో వా = యెవఁడు?

మ. శరమై, సూకరమై, మృదంగధరుఁడై, సామైసతీరత్నమై
తురంగబై, చెలియై, యనేకములు మూర్తుల్ గాంచి, నేత్రంబు నీ
చరణాబ్జంబున నిల్పి, నీతనువునంశంబంది, తాఁ బూజ్యులం
దురుపూజ్యుండగు శౌరికంటె, నెవఁడాఢ్యుం డద్రికన్యాపతీ!.

**తా** : అనగా, ఓ పార్వతీశా!, మహావిష్ణువు నీ తత్త్వమెఱుంగుట కనేకములగు నవతారములనెత్తి నిన్ను సేవించి ధన్యుఁడయ్యెను అని తాత్పర్యము.

**శ్లో॥ జననమృతియుతానాం సేవయా దేవతానాం**
**న భవతి సుఖలేశస్సంశయో నాస్తి తత్ర ।**
**అజనిమమృతరూపం సాంబమీశం భజంతే**
**య ఇహ పరమసౌఖ్యం తే హి ధన్యా లభంతే ॥ 83**

**టీక :** జననమృతియుతానాం : జనన = ఉత్పత్తియు, మృతి = మరణమును, యుతానామ్ = పొందినటువంటి, దేవతానామ్ = దేవతలయొక్క, సేవయా = భజనముచేతను, సుఖలేశః : సుఖ = సుఖముయొక్క, లేశః = లేశము, న భవతి = పుట్టదు, అత్ర = దీనియందు, సంశయః = సందేహము, నాస్తి = లేదు, యః = యెవఁడు, ఇహ = ఈ జన్మమందు, అజనిమ్ = ఉత్పత్తి శూన్యుఁడయినటువంటి, అమృతస్వరూపమయినటువంటి, అనగా మరణరహితమయినటువంటి, రూపము = కలిగినటువంటి, సాంబమ్ = పార్వతీదేవితోఁ గూడుకొన్నటువంటి, ఈశమ్ = ఈశ్వరుని గూర్చి, భజంతే = సేవ సేయుచున్నారో, తే = వారలు, ధన్యాః హి = ధన్యులు గదా.

మ. జననంబున్ మరణంబుగల్గు దివిషజ్జాతంబులం గొల్చుచుం
డిన లేశంబు సుఖంబు లేదు, విను లేనేలేద, యీ జన్మమం
దు, ననాద్యంతు, నుమామహేశు, నమృతాత్ముంగొల్చి సేవించు ధ
న్యనరశ్రేష్ఠులు చూఱగొంద్రు పరసౌఖ్యప్రాజ్య సామ్రాజ్యమున్.

**తా** : పుట్టుటయు గిట్టుటయు కలిగిన క్షుద్రదేవతలం గొలిచిన లేశమును సుఖము లేదు. ఆద్యంతరహితుఁడై మోక్షదాయకుఁడైన పరమేశ్వరుని సేవించినవారే శాశ్వతమగు పరసౌఖ్యమును జెందుచున్నారు.

**శ్లో॥ శివ! తవ పరిచర్యాసన్నిధానాయ గౌర్యా**
**భవ! మమ గుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే ।**
**సకలభువనబంధో! సచ్చిదానందసింధో!**
**సదయ! హృదయగేహే సర్వదా సంవస త్వమ్ ॥ 84**

**టీక :** హే శివ! = ఓయి సాంబశివుఁడా!, భవ! = భవుఁడను నామధేయముగలవాఁడా!, సకల భువనబంధో!:సకల = సమస్తమయిన, భువన = లోకములకు, బంధో! = బంధువయిన వాడా!, సచ్చిదానందసింధో! = సచ్చిదానందములకు సముద్రునివలెనుండెడివాఁడా!, సదయ! = దయఁ గూడుగొన్నవాఁడా!, గౌర్యా సహ = పార్వతీదేవితోఁగూడను, తవ = నీయొక్క, పరిచర్యాసన్నిధానాయ : పరిచర్యా = సేవకొరకు, సన్నిధానాయ = సమీప మందుండెడు కొరకు, మమ = నాయొక్క, గుణధుర్యామ్ = సకల సద్గుణభారవాహకమయిన, బుద్ధికన్యామ్ : బుద్ధి = బుద్ధియనెడు, కన్యామ్ = కన్యకను, ప్రదాస్యే = దానము చేయుచునున్నాను, త్వమ్ = నీవు, హృదయగేహే : హృదయ = మనస్సనెడి, గేహే = గృహమందు, సర్వదా = యెల్లప్పుడును, సంవస = ఉండుమా.

శా. ఓనిర్వ్యాజకృపానిధీ! భువనబంధూ! సచ్చిదానందసిం
ధూ! నాచిత్తగృహంబునన్ నిలువరాదో, నీకు నీ భార్యకున్
గానీ, దాస్యమొనర్ప నాదు మతియన్ కన్యామణిన్ సద్గుణ
శ్రీనిన్ నీపదసన్నిధిన్ నిలిపితిన్ జేకొమ్మిదే దాసిగాన్.

**తా** : వినయాదిగుణములు కలిగిన నాబుద్ధి ఓ పరమేశ్వరా! నీకుఁ బరిచర్యఁ జేయుటకు దాసిగా నిచ్చుచున్నాను. నాయొక్క మనస్సను గృహంబున నిత్యము వసించి అను–గ్రహింపుము.

**శ్లో॥ జలధిమథనదక్షో నైవ పాతాళభేదీ**
**న చ వనమృగయాయాం నైవ లుబ్ధః ప్రవీణః ।**
**అశనకుసుమభూషావస్త్రముఖ్యాం సపర్యాం**
**కథయ కథమహం తే కల్పయానీందుమౌళే! ॥ 85**

**టీక :** ఇందుమౌళే! = చంద్రుని శిరస్సునందు ధరించినవాఁడా!, తే = నీకు, అశన..ఖ్యాం : అశన = ఆహారము, కుసుమ = పుష్పము, భూషా = భూషణము, వస్త్ర = వస్త్రమును, ముఖ్యామ్ = ప్రధానములుగాఁ గలిగిన, సపర్యామ్ = పూజోపచారమును, కథమ్ =

ఎట్లుగా, కల్పయాని = కలిగించెదను?, కథయ = చెప్పుము, అహమ్ = నేను, జలధిమథనదక్షః : జలధి = సముద్రమును, మథన = తరుచుటకు, దక్షః = చాలినవాఁడను, నైవ = కాను. పా..దీ : పాతాళ = పాతాళలోకమును, భేదీ = భేదించువాఁడను, న చ = కాను. వ...యాం : వన = అడవియందు, మృగయాయామ్ = వేఁటాడుటయందు, ప్రవీణః = నేర్పుగల, లుబ్ధః = బోయవాఁడును, నైవ = కాను.

**మ. కలశాబ్దిన్ మథియింపలేను, ఫణిలోకంబేగిరాలేను, కా**
**నల వేటాడెడుపాటివై మను పులిందగ్రామణిన్ గానిఁ కే**
**తెలివిన్ నీ కశనప్రసూనకములం దివ్యన్మణీభారహా**
**ర లనచ్చేలములంబొనర్చెద సపర్యాచర్య నార్యాపతీ!.**

**తా** : చంద్రశేఖరా! సముద్రము మథింపఁజాలిన వాఁడనా కాను. నీ కిష్టమైన కాలకూటాహారముగాని పుష్పమువలె శిరోభూషణంబుగ చంద్రునిగాని యెట్లీనేర్తును? పాతాళలోకము భేదించువాఁడనైనఁ గాను. నీకిష్టమైన భుజగభూషణమెట్లు గల్పించఁగలను? అడవులలో మృగముల వేఁటాడ నేర్చిన బోయవాఁడనైనఁగాను. నీకభిమతంబైన గజచర్మ వస్త్రమెట్లీయఁగలను? దేవా! నిన్ను నే నెట్ల పూజింపఁగలుగుదునో చెప్పుము?

**శ్లో॥ పూజాద్రవ్యసమృద్ధయో విరచితాః పూజాం కథం కుర్మహే**
**పక్షిత్వం న చ వా కిటిత్వమపి న ప్రాప్తం మయా దుర్లభమ్ ।**
**జానే మస్తకమంఘ్రిపల్లవముమాజానే! న తేహం విభో!**
**న జ్ఞాతం హి పితామహేన హరిణా తత్త్వేన తద్రూపిణా ॥ 86**

**టీక :** ఉమాజానే! = పార్వతీదేవి భార్యగాఁ గలవాఁడా!; పూ...యః : పూజాద్రవ్య = పూజించుటకుఁ గావలసిన వస్తువులయొక్క, సమృద్ధయః = అతిశయములు, విరచితాః = సమకూర్పఁబడినవి, పూజామ్ = పూజను, కథమ్ = ఎట్లుగా, కుర్మహే = చేయుదుము?, దుర్లభమ్ = పొందశక్యముగాని, పక్షిత్వమ్ = హంసపక్షిరూపమగుటయు, న–చ–వా = లేనిచో, కిటిత్వమపి = వరాహరూపమగుటయైనను, మయా = నాచేత, న ప్రాప్తమ్ = పొందఁబడలేదు. అహమ్ = నేను, తే = నీయొక్క, మస్తకమ్ = శిరస్సును, అంఘ్రిపల్లవమ్ = చిగురువంటిపాదమును, న జానే = ఎఱుఁగను. విభో! = సర్వవ్యాపకుఁడా!, తద్రూపిణా = హంస కిటి రూపములు బొందిన, పితామహేన = బ్రహ్మదేవునిచేతను, హరిణా = విష్ణుమూర్తిచేతను, తత్త్వేన = యథార్థముగా, న జ్ఞాతం హి = తెలయఁబడలేదుగదా!

**మ. సముపార్జించితి దేవ! నీకునయి పూజాద్రవ్యముంగాని పం**
**తముతో మున్ విధిహంసరూపము, రమాదారుండు భూధారరూ**

పమునుందాల్చి, దివిన్ భువిన్ వెదకి, పోల్పన్ లేనినీయుత్తమాం
గము, నీపాదము నేనెటింగికొని శక్యంబౌనె పూజింపఁగన్.

**తా** : పార్వతీమనోహరా! పూజాద్రవ్యములు విశేషముగా సమకూర్పబడియుండనిమ్ము. అపుడు మాత్రము నిను పూజించుట యెట్లు? నీ శిరస్సును తెలియదు. నీ పాదములును దెలియవు. హంసరూపము, వరాహరూపము దుర్లభములు. అవి నాకుఁ గలిగినవి కావు. ఆ రూపములు దాల్చిన బ్రహ్మదేవుఁడు, విష్ణుమూర్తియు మాత్ర మేపాటి తెలిసికొనగలిగిరి? యథార్థము తెలియనేలేదు గదా!

**శ్లో॥ అశనం గరళం ఫణీ కలాపో వసనం చర్మ చ వాహనం మహోక్షః ।**
**మమ దాస్యసి కిం కిమస్తి శంభో! తవ పాదాంబుజభక్తిమేవ దేహి ॥87**

**టీక** : శంభో! = ఓ శంకరుఁడా!, తవ = నీకు, అశనమ్ = భోజనము, గరళమ్ = విషము, కలాపః = భూషణము, ఫణీ = పాము, వసనమ్ = వస్త్రము, చర్మ = ఏనుగుతోలు, వాహనం చ = వాహనమును, మహోక్షః = ముసలియెద్దు, కిమ్ = ఏమి, దాస్యసి = ఇచ్చెదవు?, మమ = నాకుఁగావలసినది, కిమ్ = ఏమి?, అస్తి = ఉన్నది?, తవ = నీయొక్క, పాదాంబుజభక్తిమేవ : పాదాంబుజ = పాదపద్మములయందు, భక్తిమేవ = భక్తిమాత్రమే, దేహి = ఇమ్ము.

గీ. అన్నము విసంబు, నగలెన్నఁబన్నగములు
వసనమొకతోలు వార్వంబు ముసలియెద్దు
ఇంకనేమీయఁగలవు నాకేమి వలదు
పార్వతీశ! భవత్పాదభక్తినిమ్ము.

**తా** : సౌఖ్యనిధీ! నీవు భుజించునది విషము, అలంకరించుకొనునది పాము, కట్టుకొనునది యేనుఁగు తోలు, ఎక్కితిరుగు వాహనము ముసలియెద్దు. ఇంక నాకిష్టమయినది నీయొద్ద నేమియున్నది? నీవేమి యిచ్చెదవు? నీపాదభక్తి యొక్కటే చాలు నదియిమ్ము.

**శ్లో॥ యదా కృతాంభోనిధిసేతుబంధనః కరస్థలాధఃకృతపర్వతాధిపః ।**
**భవాని తే లంఘితపద్మసంభవస్తదా శివార్చాస్తవభావనక్షమః ॥ 88**

**టీక** : శివ! = ఓ సాంబమూర్తీ!, యదా = ఎప్పుడు, కృ...నః : కృత = చేయఁబడిన, అంభోనిధి = సముద్రమందు, సేతుబంధనః = వారధి నిర్మాణము గలవాఁడను, కర...పః : కరస్థల = అఱచేతితో, అధఃకృత = దిగువకణఁచఁబడిన, పర్వతాధిపః = వింధ్యపర్వతము గలవాఁడను, లంఘి... వః : లంఘిత = అతిశయింపఁబడిన, పద్మసంభవః = బ్రహ్మదేవుఁడు గలవాఁడను, (అగుదునో), తదా = అప్పుడు, తే = నీయొక్క, అర్చాస్తవ : అర్చా =

పూజయందును, స్తవ = స్తోత్రమందును, భావన = ధ్యానమందును, క్షమః = సమర్థుఁడను, భవాని = అగుదును.

శా. నేనే వారిధిఁగట్టు రాఘవుఁడనేనిన్, వింధ్యభూమీధ్రమున్
జేనొక్కంగల కుంభసంభవుఁడనేనిన్, బద్మజున్ మించు వి
జ్ఞాన శ్రీనిధినేని, తావకపదార్చాకీర్తనధ్యాన ని
ష్ఠానిష్ణాతుఁడనై గణింతుగద యీశా! నీదుసాన్నిధ్యమున్.

**తా** : సాంబశివా! సముద్రమునకు వారధి గట్టిన శ్రీరాములును, అఱచేతితో వింధ్యపర్వతము నేలకణఁచిన యగస్త్యులును, బ్రహ్మదేవునికన్న నెక్కువవాఁడును నేనగుదునేని క్రమముగా నీపూజాస్తోత్ర ధ్యానములు చేయుటకు సమర్థుఁడనుగా నుందును.

**శ్లో॥ నతిభిర్నుతిభిస్త్వమీశ! పూజా-
విధిభిర్ధ్యానసమాధిభిర్న తుష్టః ।
ధనుషా ముసలేన చాశ్మభిర్వా
వద తే ప్రీతికరం తథా కరోమి ॥ 89**

**టీక :** ఈశ! = ఓయి ఈశ్వరుఁడా!, త్వమ్ = నీవు, నతిభిః = నమస్కారముల చేతను, నుతిభిః = స్తోత్రములచేతను, పూజావిధిభిః = పూజావిధానములచేతను, ధ్యానసమాధిభిః = ధ్యానసమాధులచేతను, ధనుషా = వింటి దెబ్బలచేతను, ముసలేన చ = రోకలిపోట్లచేతను, అశ్మభిర్వా = ఱాళ్లు రువ్వుటచేతనుంబలె, తుష్టః = సంతోషించినవాఁడవు, న = కావు, తే = నీకు, ప్రీతికరమ్ = (పై రెంటిలో) ప్రియమైనది, వద = చెప్పుము, తథా = అట్లు, కరోమి = చేయుదును.

చ. నతులున్, సన్నుతులున్, సమర్చలును ధ్యానప్రక్రియల్ నీకు స
మ్మతిగావేని వచింపు మేకతన యుష్మత్తృప్తియౌనో జగ
త్పతి! కోదండముఁదాల్తునో, ముసలమున్ బాటింతునో సాహసో
ద్ధతి నీతోడఁబెనంగిరువ్వుదునొ మీఁదన్ గండశైలంబులన్.

**తా** : పరమేశ్వరా! నమస్కారములు, స్తోత్రములు, పూజలు, ధ్యానములు, సమాధులు మున్నగువానితోఁ దృప్తినొందక వింటిదెబ్బలు, రోకలిపోట్లు, ఱాళ్లు రువ్వుట మొదలగు వానితోఁ బరమప్రీతి నొందితివని పురాణగాథలు వింటిని. ఇందు నీకేది ప్రియమో చెప్పుమటు చేయుదును.

**శ్లో॥ వచసా చరితం వదామి శంభో-
రహముద్యోగవిధాసు తేఽప్రసక్తః ।**

**మనసాఽఽకృతిమీశ్వరస్య సేవే**
**శిరసా చైవ సదాశివం నమామి ॥ 90**

**టీక :** అహమ్ = నేను, తే = నీయొక్క, ఉద్యోగ = ఉన్నతయోగముల యొక్క, విధాసు = విధానముల యందు, అప్రసక్తః = పరిచయములేని వాఁడను, వచసా = వాక్కుచేత, శంభోః = సుఖస్వరూపుఁడవగు, తే = నీయొక్క, చరితమ్ = చరితమును, వదామి = చెప్పుచున్నాను. మనసా = మనస్సుచేత, ఈశ్వరస్య = ఈశ్వరుఁడవైన, తవ = నీయొక్క, ఆకృతిమ్ = ఆకారమును, సేవే = సేవించుచున్నాను. శిరసా = శిరస్సుచేత, సదాశివమ్ = నిత్యసుఖస్వరూపుఁడవైన, త్వమేవ = నిన్నే, నమామి = నమస్కరించుచున్నాను.

క. **తలపుఁననిను గొలుచుటయున్**
**దలచేమ్రొక్కుటయు, వాక్కునను నీచరితం**
**బులు గీర్తించుటగాకే**
**కలుములు వలదయ్య నాకు గౌరీరమణా!.**

**తా :** దేవా! ఉత్తమంబులైన శివయోగంబులయందు పరిచయము లేదు. చిత్తమంత స్థిరముగా నిలువదు కావున వాక్కుతో మీ చరిత్రంబులు పలుకుచు మనస్సున మీయాకృతి ధ్యానించుచు శిరస్సుతో మీ పాదపద్మములకు నమస్కరించుచు శక్తివంచనలేక సేవించెదను.

**శ్లో॥ ఆద్యాఽవిద్యా హృద్గతా నిర్గతాసీ-**
**ద్విద్యా హృద్యా హృద్గతా త్వత్ప్రసాదాత్ ।**
**సేవే నిత్యం శ్రీకరం త్వత్పదాబ్జం**
**భావే ముక్తేర్భాజనం రాజమౌలే! ॥ 91**

**టీక :** రాజమౌలే! = ఓ చంద్రశేఖరా!, త్వత్ప్రసాదాత్ = నీయనుగ్రహమువలన, హృద్గతా = హృదయము నంటియున్న, ఆద్యా = మొట్టమొదటిదియగు, అవిద్యా = యజ్ఞానము, నిర్గతా = తొలగిపోయినది. ఆసీత్ = అయ్యెను, యా = ఏ జ్ఞానము, హృత్ = హృదయ గ్రంథిని హరించునదియో, (సా = ఆ), విద్యా = జ్ఞానము, హృద్గతా = హృదయమునఁ బ్రవేశించిన (దయ్యెను), శ్రీకరమ్ = సంపత్కరమును, ముక్తేః = మోక్షమునకు, భాజనమ్ = ఆధారమైనదియునగు, త్వత్పదాబ్జమ్ = నీ పాదపద్మమును, భావే = మనస్సునందు, నిత్యమ్ = ఎప్పుడును, సేవే = ధ్యానించుచున్నాను.

గీ. **నాదుమదిఁదొల్తనున్న యజ్ఞానమణఁగి**
**హృద్యమగువిద్య నీకృప నెసఁగెఁగాన**
**రాజమౌళి! నిఃశ్రేయసభాజనంబు**
**శ్రీకరము నీపదాబ్జమాసింతు నెపుడు.**

**తా** : సాంబశివా! నీ యనుగ్రహమువలన నాయజ్ఞానము తొలంగిపోయి హృదయగ్రంథి భేదకం బగు సుజ్ఞానంబు గలిగినది. లక్ష్మీకరంబును మోక్షప్రదంబునునగు నీపాదయుగ్మము సేవించెదను.

**శ్లో॥ దూరీకృతాని దురితాని దురక్షరాణి**
**దౌర్భాగ్యదుఃఖదురహంకృతిదుర్వచాంసి ।**
**సారం త్వదీయచరితం నితరాం పిబంతం**
**గౌరీశ! మామిహ సముద్ధర సత్కటాక్షైః ॥ 92**

**టీక :** గౌరీశ! = ఓ పార్వతీరమణా!, దురక్షరాణి = బ్రహ్మలలాటమందు వ్రాసిన దుష్టలిపి సూచకములును, దురితాని = పాపకర్మముచేతఁ గలిగినవియు, దౌ... సి : దౌర్భాగ్య = దురదృష్టమును, దుఃఖ = దుఃఖము, దురహంకృతి = దుష్టములగు దేహాదులయందు 'అహం' అను భావమును, దుర్వచాంసి = పరుషభాషణమును, సత్కటాక్షైః = నీకడకంటి చూపులచేత, దూరీకృతాని = దూరముగాఁబోఁగొట్టఁబడినవి. సారమ్ = సారమైన, త్వదీయ చరితమ్ = నీ చరిత్రను, నితరామ్ = మిక్కిలి, పిబంతమ్ = వినుచున్న, మామ్ = నన్ను, ఇహ = ఈ జన్మమందు, సముద్ధర = ఉద్ధరింపుము.

**మ. దురితంబుల్ సమసెన్, దురక్షరపుఁబంజ్ఞుల్ మాసె, దౌర్భాగ్యదుః**
**ఖ రిరంసల్ నశియించెఁ, బోయె దురహంకారంబు, దుర్వాక్కులున్**
**దొఱఁగెన్ నీకృపచేత నో భువనబంధూ! కావుమా సారవ**
**చ్చరితోదారభవత్కథాసుధల నీజన్మంబు వేగించెదన్.**

**తా** : సాంబశివా! ఉత్పత్తికాలమున బ్రహ్మ నుదుట వ్రాసిన వ్రాతలకు సూచకంబులై పాపకర్మమువలన గలిగిన దురదృష్టము, దుఃఖము, దురహంకారమును నీకటాక్ష వీక్షణముచేఁ బాసినవి. ఇంక సారభూతమైన నీచరిత్రంబులు వినుచుందును. నన్నీ జన్మము నుండి తరింపఁజేయుము.

**శ్లో॥ సోమకళాధరమౌలౌ**
**కోమలఘనకంధరే మహామహసి ।**
**స్వామిని గిరిజానాథే మామక-**
**హృదయం నిరంతరం రమతామ్ ॥ 93**

**టీక :** మామకహృదయమ్ = నా మనస్సు, సోమకళాధరమౌలౌ = శిరస్సున చంద్రకళ ధరించినట్టియు, కో... రే : కోమల = కోమలమైన, ఘన = మేఘమువంటి, కంధరే = మెడగలిగినట్టియు, స్వామిని = సర్వనియామకమైనట్టియు, గిరిజానాథే = పార్వతీరూపమైన, మహామహసి = మహాజ్యోతియందు, నిరంతరమ్ = ఎల్లప్పుడును, రమతామ్ = క్రీడించుగాక.

క. సోమకళాధరమౌళిన్
హైమావతీనాథుఁ గోమలాంభోదగళున్
స్వామిని, మహానుభావుని
మామక హృదయంబు వలచి మఱి రమియించున్.

**తా** : శిరస్సున చంద్రరేఖ, కోమలమైన మేఘమువంటి కంఠమును గలిగి సర్వనియంతయై పార్వతీపరమేశ్వర రూపముతో వెలయుచున్న పరజ్యోతిస్స్వరూపమైన పరబ్రహ్మమునందు నాచిత్తమెప్పుడును విహరించుచుండుఁగాక.

**శ్లో॥ సా రసనా తే నయనే**
**తావేవ కరౌ స ఏవ కృతకృత్యః ।**
**యా యే యౌ యో భర్గం**
**వద తీక్షేతే సదాఽర్చతస్స్మరతి ॥ 94**

**టీక :** యా = ఏ నాలిక, భర్గమ్ = పరమశివుని బోధించు 'భర్గ' శబ్దమును, వదతి = పలుకుచుండునో, యే = ఏ కన్నులు, భర్గ = శివుని, ఈక్షేతే = చూచుచుండునో, యౌ = ఏ చేతులు, భర్గమ్ = శివుని, సదా = ఎల్లప్పుడును, అర్చతః = పూజించుచుండునో, యః= ఏ భక్తుఁడు, భర్గమ్ = శివుని, స్మరతి = తలంచుచుండునో, సా = అదియే, రసనా = నాలుక, తే = అవియే, నయనై = కనులు, తావేవ = అవియే, కరౌ = చేతులు, స ఏవ = వాఁడే, కృతకృత్యః = కృతార్థుఁడు.

క. అదె నాలుక, యదె కన్గవ
యదె కరయుగమతఁడె ధన్యులందున్ ధన్యుం
డెదిశివుఁబలుకునో, కనునో
యెది పూజించెడినొ యెవ్వఁడెంచునో భక్తిన్.

**తా** : ఎల్లప్పుడీశ్వరనామముచ్చరించుచుండు నాలుకయే నాలుక. ఎల్లవేళల నీశ్వరుని చూచుచుండు కన్నులే కనులు. ప్రతిదినమీశ్వరుని పూజించుచుండు చేతులే చేతులు. నిరంతరము పరమేశ్వరుని ధ్యానించుచుండు భక్తుఁడే కృతకృత్యుఁడునగును. తక్కినవి నిరర్థకంబులని తాత్పర్యము.

**శ్లో॥ అతిమృదులౌ మమ చరణా-**
**వతికఠినం తే మనో భవానీశ! ।**
**ఇతి విచికిత్సాం సంత్యజ**
**శివ! కథమాసీద్గిరౌ తథా వేశః ॥ 95**

**టీక :** శివ! = ఓ మంగళ స్వరూపుఁడా!, భవానీశ! = ఓ పార్వతీపతీ!, మమ = నా యొక్క, చరణౌ = పాదములు, అతిమృదులౌ = మిగుల కోమలమైనవి, తే = నీయొక్క, మనః = మనస్సు, అతికఠినమ్ = మిక్కిలి కఠినమైనది, ఇతి = అని, విచికిత్సామ్ = సంశయమును, సంత్యజ = విడువుము. తథా = అట్టి, గిరౌ = పర్వతముమీఁద, వేశః = గృహము, కథమ్ = ఎట్లు, ఆసీత్ = ఉన్నదాయ్యెను?

గీ. మృదులమృదులంబు లగు నాదుపదములేడ
పరుషపరుషంబయిన నీదుభావమేడ
యనినది చెల్లనయ్యా యట్టైన
కొండయందెట్లు తిరిగెదు కొండఱేఁడ.

**తా :** దేవా! భవానీపసనాథా! ఈ భక్తుని చిత్తము మిక్కిలి కఠోరముగా నుండును. కోమలమైన నా పాదములతో దానియందు సంచరించుట యెట్లని మీరు సంశయింపఁబనిలేదు. అంతకఠోరముగా నుండు పర్వతముమీదఁ గౌరీసమేతులై మీరు ఉండుటలేదా?

**శ్లో॥ ధైర్యాంకుశేన నిభృతం**
**రభసాదాకృష్య భక్తిశృంఖలయా ।**
**పురహర! చరణాలానే**
**హృదయ మదేభం బధాన చిద్యంత్రైః ॥ 96**

**టీక :** పురహర! = త్రిపురములు జయించినవాఁడా!, హృదయమదేభమ్ = (నా) మనస్సను మదపుటేనుఁగును, ధైర్యాంకుశేన = ధైర్యంబనెడి యంకుశముతో, రభసాత్ = వేగమువలన, ఆకృష్య = వశపరచుకొని, భక్తిశృంఖలయా = భక్తియను గొలుసుతో, చరణాలానే = మీ పాదంబను యేనికకట్రాడు నందు, చిద్యంత్రైః = ఈశ్వరమహిమ జ్ఞానంబు లనెడి యంత్రములతో, నిభృతమ్ = కదలకుండ, బధాన = బంధింపుము.

మ. మదవన్నామక చిత్తవారణము నంబానాథ! ధైర్యాంకుశ
ప్రదరంబూని మదోద్ధతిం గెడపి దివ్యజ్ఞానయంత్రస్థలిన్
గదియంజేరిచి భక్తి నామనిగళోద్ఘాతంబుతోడన్ భవ
త్పదపద్మంబను కట్టుకంబమునకున్ బంధించి సాధింపుమా.

**తా :** పురహరుండవైన ఓ మహాదేవా! శత్రుపురంబులు జయించిన రాజు మత్తగజంబుల నంకుశంబుతో వశపఱచుకొని గొలుసులతో బిగించి యుపాయమున కట్టుఁగంబంబులం గట్టియుంచునట్లు నామనోగజంబును స్థైర్యమంకుశముగా నీవశము చేసికొని భక్తియను సంకెలతో నీ మహత్త్వజ్ఞానము ముడివెట్టి నీ పాదంబున బంధింపుము.

శ్లో॥ ప్రచరత్యభితః ప్రగల్భవృత్యా
మదవానేష మనఃకరీ గరీయాన్ ।
పరిగృహ్య నయేన భక్తిరజ్జ్వా
పరమ! స్థాణుపదం దృఢన్నయాముమ్ ॥ **97**

**టీక :** పరమ! = ఓ అపరిచ్ఛిన్న స్వరూపుఁడా!, మదవాన్ = మదముగలిగిన, గరీయాన్ = గొప్పదియగు, ఏషః = ఈ, మనఃకరీ = చిత్తగజము, ప్రగల్భవృత్యా = ఆపరాని గమనముతో, అభితః = అంతటను, ప్రచరతి = సంచరించుచున్నది, అముమ్ = దీనిని, భక్తిరజ్వా = భక్తియను త్రాడుతో, నయేన = అనునయముతో, పరిగృహ్య = పట్టుకొని, స్థాణు = స్థిరమయిన, పదమ్ = స్థానమును, దృఢమ్ = మరల తిరిగి రాకుండ, నయ = పొందింపుము.

క. మత్తిల్లి యిచ్చవచ్చిన
యెత్తున నెల్లెడఁజరించునీ నాచిత్తో
న్మత్తగజంబుం జేర్పుము
దాత్తపుభక్తి యనుమేటి స్థాణు పదంబున్. ॥

**తా** : ఓ అపరిచ్ఛిన్నానందమూర్తీ! ఈ నా మానస మత్తగజము నిలుపుటకు వీలుపడని గమనముతో నలువంకలఁ బరువు లిడుచున్నది. దీని నీ భక్తియను త్రాడుతో గట్టి మెల్లగాఁ బట్టుకొని పునరావృత్తి రహితముగా స్థిరమైన బ్రహ్మపదము జేర్పుము.

శ్లో॥ సర్వాలంకారయుక్తాం సరళపదయుతాం సాధువృత్తాం సువర్ణాం
సద్భిస్సంస్తూయమానాం సరసగుణయుతాం లక్షితాం లక్షణాఢ్యామ్ ।
ఉద్యద్భూషావిశేషాముపగతవినయాం ద్యోతమానార్థరేఖాం
కళ్యాణీం దేవ! గౌరీప్రియ! మమ కవితాకన్యకాం త్వం గృహాణ ॥**98**

**టీక :** గౌరీప్రియ! = గౌరీదేవి ప్రియురాలుగాఁగల, దేవ! = మహాదేవా!, స... క్తాం : సర్వ = సమస్తమైన, అలంకార = ఉపమ, ఉత్ప్రేక్ష మొదలగు అలంకారముల తోడను (భూషణములతోడను), యుక్తామ్ = కూడినదియు, స... తాం : సరళ = మృదువైన, లేక సుబోధమైన (మందమగు) పద = శబ్దములతో (నడకలతో), యుతామ్ = కూడినదియు, సాధువృత్తామ్ = సలక్షణమైన ఆర్యావృత్తము మొదలగు వృత్తములు గలదియు (మంచి నడత గలదియు), సువర్ణామ్ = పరుషములుగాని అక్షరములు గలదియు (చక్కని రూపము గలదియు), సద్భిః = కావ్యలక్షణము (శరీరలక్షణము) దెలిసిన పెద్దలచేత, సంస్తూయమానామ్ = కొనియాడఁబడుచున్నదియు, సరసగుణయుతామ్ = శృంగారాది రసములు మాధుర్యాది

గుణములు వీనితోఁ గూడినదియు (భర్తకిష్టంబగు గుణములతోఁ గూడినదియు), లక్షితామ్ = ప్రతిపాద్యవస్తువు గలదియు (వరింపఁ దగినదిగా నెన్నఁబడినదియు), లక్షణాఢ్యామ్ = సర్వలక్షణముల మెప్పునదియు, ఉ... షాం : ఉద్యత్ = ఎక్కువగా బ్రకాశించుచున్న, భూషావిశేషామ్ = అలంకార విశేషము గలదియు (సుశీలత్వము గలదియు), ఉపగత వినయాం : ఉపగత = తెలియఁబడిన, వినయామ్ = (కవి యొక్క) వినయము గలదియు (పొందఁబడిన నమ్రత గలదియు), ద్యో... ఖాం : ద్యోతమాన = స్పష్టముగా స్ఫురించుచున్న, అర్థముల పరంపరగలదియు (భాగ్యరేఖ గలదియు), కల్యాణీమ్ = అర్థపుష్టిగా భాషించు నదియునగు, మమ = నాయొక్క, కవితాకన్యకామ్ = కవితయను కన్యకను, త్వమ్ = నీవు, గృహాణ = స్వీకరింపుము.

**మ. సకలాలంకృతిసంస్కృతంబు, సుమనస్సంస్తూయమానంబు స**
**ర్వకలాలక్షణలక్షితాఢ్యము, సువర్ణద్యోతమానార్థమున్,**
**ప్రకటశ్రీగుణమున్, సువృత్తమును శుంభద్భూషనంబైనమా**
**మకకావ్యంబను కన్యకామణిని, బ్రేమంగొమ్ము గౌరీప్రియా!.**

**తా** : గౌరియందు ప్రేమగలవాఁడవైన ఓ మహాదేవా! ఈ నా కవితాకన్య కన్యకా లక్షణంబులు గలిగి కల్యాణమునకుఁ దగియున్నది. లోకమందు కన్య సర్వాభరణంబులు కలిగియుండును. ఇయ్యదియు సర్వాలంకారములుఁ గలిగియున్నది. కన్యక సరళపదంబు (మందగమనంబు)ల నొప్పారు. ఇయ్యదియు మృదువై సుబోధంబులగు పదంబులతో సొంపు నింపుచున్నది. కన్యక సాధువృత్త (సత్కర్మములయందు ప్రవర్తించునది) యగును. ఇయ్యదియు లక్షణ విరుద్ధముగాని వృత్తములు కలిగియున్నది. 'సువర్ణ' మనఁగా కన్యకు సురూపంబును గవితకుఁ బరుషంబులుగాని యక్షరములుం గలవు. శరీర లక్షణ మెఱిఁగిన వారాకన్యను మెచ్చుకొందురు. కావ్యలక్షణవేత్త లీకవితనుఁ గొనియాడుచున్నారు. కన్యకు సరసమైన గుణములుండును. దీనికి శృంగారాది రసంబులును మాధుర్యాది గుణంబులుంగలవు. కన్య వరుల యెన్నిక వడిసినట్టు లియ్యదియు నొక్కొక్క యంశమును గూర్చిన యెన్నిక గలదియై యున్నది. సర్వలక్షణసంపత్తి యిరువురకుం గలదు. కన్య వినయము గలదియగును. కవితయుఁ గవివినయముఁ దెలుపఁగలిగి యున్నది. కన్యకు సుశీలత్వము ఆభరణ విశేషముగాఁ బ్రకాశించును. కవితయందును విశేషాలంకారములు ప్రకాశించుచున్నవి. కన్యయం దర్థరేఖలనఁగా భాగ్యరేఖలు స్ఫురించుచుండును. కవితయందును పదార్థ పరంపర స్ఫురించుచున్నది. అర్థపుష్టి గలిగిన భాషణము సాధారణముగాఁ గలదు. ఇట్టి నా కవితా కన్యను నీకిచ్చెదను బ్రతిగ్రహింపుము.

**శ్లో॥ ఇదం తే యుక్తం వా పరమశివ! కారుణ్యజలధే!**
**గతౌ తిర్యగ్రూపం తవ పదశిరోదర్శనధియా ।**

**హరిబ్రహ్మాణౌ తౌ దివి భువి చరంతౌ శ్రమయుతౌ**
**కథం శంభో! స్వామిన్కథయ మమ వేద్యోఽసి పురతః ॥ 99**

**టీక :** పరమశివ! = సకలదేవతా సార్వభౌముఁడవైన శివుఁడా!, కారుణ్యజలధే! = కరుణాసముద్రుఁడా!, తవ = నీయొక్క, పదశిరోదర్శనధియా = పాదములను, శిరస్సునుఁ గనుఁగొనవలయునను బుద్ధితో, తిర్యగ్రూపమ్ = తిర్యగ్జంతువు (పంది, హంస)ల రూపమును, గతౌ = పొందిన, తౌ =ఆ, హరిబ్రహ్మాణౌ = విష్ణుమూర్తియు, బ్రహ్మదేవుఁడును, దివి = ఆకాశమందును, భువి = భూమియందును, చరంతౌ = సంచరించుచున్నవారలై, శ్రమయుతౌ = ఆయాసముతోఁ గూడినవారలు, (స్యాతామ్ = అయిరి), శంభో! = సుఖప్రదుఁడా!, స్వామిన్! = సర్వలోకాధినాథా!, మమ = నాయొక్క, పురతః = ముందరను, వేద్యః = కనుఁగొనఁదగినవాఁడవు, కథమ్ = ఎట్లుగా, అసి = అగుదువు?, కథయ = చెప్పుము, ఇదమ్ = ఇది, తే = నీకు, యుక్తం వా = తగునా?

మ. సరవిన్ దావకపాదశీర్షక దిదృక్షాదీక్షమైమున్ను శ్రీ
హరియున్ దామరసప్రసూతియును, దిర్యగ్రూపులై భూనభోం
తరమాద్యంతము పంతముంగొని శ్రమన్గాలించి గాలించి తా
వరయంజాలని నీపదంబిఁక ననంతా! కాంతునేనేక్రియన్.

**తా** : పరమశివా! మీ పాదదర్శనమునకై పందిరూపముందాల్చి శ్రీహరియు, శిరోదర్శనమునకై హంసరూపముదాల్చి బ్రహ్మయుఁ బాపమిట్లు తిర్యగ్జంతువు లగుటయే గాక భూమ్యంతరిక్షము లందంతట దిరిగి పలువిధములఁ బాటుపడిరేకాని ఫలముగాంచ కుండిరి. ఓ శంకరా! స్వామి! సరియే? ఇప్పుడు మీరు నా యెదుట ప్రసన్నులై నాకెటు తెలియనగుదురో శెలవిందు. శివుఁడు భక్తపరాధీనుఁడు గాన హరిబ్రహ్మలకలవిగాని తన దర్శనమును భక్తులకొసంగునని ముఖ్యాభిప్రాయము.

**శ్లో॥ స్తోత్రేణాలమహం ప్రవచ్మి న మృషా దేవా విరించాదయ-**
**స్స్తుత్యానాం గణనాప్రసంగసమయే త్వామగ్రగణ్యం విదుః ।**
**మాహాత్మ్యాగ్ర్యవిచారణప్రకరణే ధానాతుషస్తోమవ-**
**ద్ధూతాస్త్వాం విదురుత్తమోత్తమఫలం శంభో! భవత్సేవకాః ॥ 100**

**టీక :** శంభో! = సుఖకారణమైనవాఁడా!, భవత్సేవకాః = నీ భక్తులయిన, విరించాదయః = బ్రహ్మాదులగు, దేవాః = దేవతలు, స్తుత్యానామ్ = స్తుతింపఁదగిన వారల యొక్క, గణనాప్రసంగసమయే = లెక్కలను గుణించి చర్చించునప్పుడు, త్వామ్ = నిన్ను, అగ్రగణ్యమ్ = మొదట గణింపఁ దగినవానిఁగా, విదుః = తెలిసికొనుచున్నారు, మా... ణే : మాహాత్మ్య = సృష్టిస్థితిలయ సామర్థ్యమును గూర్చిన, అగ్ర్యవిచారణ = మొదటి చర్చను, ప్రకరణే =

చేయునప్పుడును, ధానాతుష స్తోమవత్ = సారములేని ధాన్యము నందలి పొట్టంతయుం బోలె, ధూతాః = కదలి పోయినవారలై, త్వామ్ = నిన్ను, ఉత్తమోత్తమఫలమ్ = మిగుల సారమైన ధాన్యముగా, విదుః = తెలిసికొనుచున్నారు. స్తోత్రేణ = స్తుతిచేత, అలమ్ = చాలును, అహమ్ = నేను, మృషా = అసత్యము, న ప్రవచ్మి = చెప్పను.

**మ.** **నిను స్తోత్రవ్యులలో గణింత్రు మొనగానింగా విధాత్రాదులె**
**ల్ల నజాండాదికసృష్టిలోనయిన లీలన్ వారు నీముందు నెం**
**దునకున్ గారిఁక, నుత్తమోత్తమఫలస్తోమంబు నీకంటె లే**
**దని నీభక్తజనంబెఱుంగు, నిజమీశా! యింకఁజాలున్ నుతుల్.**

**తా** : శంభో! మహాదేవ! బ్రహ్మాదులగు ముప్పదిమూడుకోట్ల దేవతలను స్తోత్రార్హులను లెక్కించునప్పుడు నిన్ను మొట్టమొదటివానిగా లెక్కపెట్టుచున్నారు. సృష్టి స్థితి లయ సామర్థ్యరూపమైన మాహాత్మ్యమును గుఱించి చర్చించునప్పుడు, ధాన్యపు రాశి యెగురఁ బట్టునప్పుడు పొట్టంతయు దూరముగాఁ బోయినట్లు తామందఱు దూరమైపోయి సారమై ధాన్యమునట్లు నిన్నుత్తమోత్తమునిగాఁగనుచున్నారు. దేవా! ఇవి వట్టి స్తుతిపాఠములు గావు. నేను చెప్పినదంతయు నిజము గాని యిసుమంతయు నసత్యము గాదు. సకల శ్రుతి స్మృతి ప్రసిద్ధము. స్వామీ! బ్రహ్మాదులందఱు మీ సేవకులే గదా!

శ్రీః




BRIEF LIFE HISTORY OF

# SRI BALIJEPALLI LAKSHMIKANTHAM

He was born in **Itikampadu** Village of Guntur District near Bapatla in 1881 to **Narasimha Sastry and Adilakshmamma**. After matriculation in Kurnool, he worked for some in the Sub-Registrar Office as Gumasta. He worked as teacher in Hindu College. He used to tour different Zamindaris to perform Avadhanams.

He established **Chandrika Printing Press** in Guntur with the help of Challapalli Raja in 1922. He has participated in Salt Satyagraha and jailed. While in prison, he wrote **Satya Harischandriyam drama**. He established First drama companyin 1926 and played **Satya Harischandra** and **Uttara Raghavam** many times. He used to play critical roles in these plays. The most prominent role he used to play was **Nakshatraka**.

He entered the film Industry with encouragement by **Chittajallu Pullayya** and wrote dialogues and songs and acted some Telugu Films. His debut film as an actor in **Vara Vikrayam** in 1939. He portrayed the character Lingaraju. He died in **Sri Kalahasti** in 1953.

